# ఊర్వశి

(ప్రఖ్యాత స్టేజి నాటకము)



కవి :

ప్రజాకవులు — శతాధిక గ్రంథకర్తలు

ఏలూరు కళాశాలాధ్యాపకులు

**శ్రీ జంపన చంద్రశేఖరరావు, ఎం. ఏ., బి. ఇడి., గారు.**



ప్రదర్శకులు :

**ప్రజాభ్యుదయ నాట్యమండలి**

**ఏలూరు.**



ప్రచురణకర్తలు :

జంపన బుక్ డిపో

ఏలూరు.

**1948**



[ వెల రు **1—4—0.**

# హెచ్చరిక.

నా లిఖితపూర్వక అనుమతి పొందనిదే ఎవ్వరునూ దీనిని ప్రదర్శింపరాదు. దీనిలోని పాటలుగాని, మాటలుగాని, పద్యములుగాని, కధనుగాని ఏందు నిమిత్తమూ ఎవ్వరూ ఉపయోగించరాదు.

జంపన.

# "త్యాగమూర్తి - మా జంపన"

అమృత ప్రవాహము పగిది మధుర గానము నాలపించు ఈ "కవికోకిల" ను నేను నవలా ప్రపంచమున ఎరుగుదును.

"కావ్యేషు నాటకమ్ రమ్యమ్" అను సూత్రము ననుసరించి ఈ కవికోకిల శృంగార రస రాగము నాలపించుచూ, నాటక ప్రపంచ మున స్వచ్ఛంద స్వైర విహారము సలిపెను. ప్రప్రథమమున ప్రణయ మూర్తి 'మండోదరి' మంగళ గళమున మధుర మంజుల 'గీతికా' సుమమాల నలంకరించెను. తదుపరి "కలౌ వేంకటేశ్వరో హరిః" అన్న వేంకటేశ్వరుని వేనోళ్ళ నుతించి, "వేంకటేశ్వర మాహాత్మ్యము" సృష్టించి, సహృదయ లోకమునకు మా 'బందా బావ' ద్వారా అందించి, వాఙ్మయ ప్రపంచమున ఒక నూతన జ్యోతిని వెలిగించి దేశమును ముందడుగు వేయించెను.

అంతటితో నలసట చెందక, గంధర్వలోకమునుండి 'ఊర్వశి' ని ఉయ్యాల లూపుచూ, నాటక ప్రపంచమున కాహ్వానించి, రత్నమయ కిరీట మలంకరించి, రాగ రస సామ్రాజ్య రాజ్ఞీమతల్లిని జేసి, నాటక సింహాసనాధ్యాయినిగా నొనర్చి, ధన్యజీవి అయినాడు.

'లోకము కర్మబద్ధమా ? ప్రేమబద్ధమా ?' అన్న సందియ మున నలిగిపోవు నా ప్రజలకు 'లోకము ప్రేమ బద్ధమే – కర్మబద్ధము కాదు;' అని ప్రబోధింప నుద్దేశించి, వ్యాఖ్యానకర్తల (నటీనటుల) వెదుక నారంభించినాడు. ఈ రసపిపాసి తన భావనాప్రపంచమున భావాల కుంచలతో, రాగమే రంగులు కాగా చిత్రించి, నిర్మించు కొన్న రూపాలకు తగిన రూపాల నీ వాస్తవ ప్రపంచమున అన్వేషించి అన్వేషించి అలసిపోయినాడు. ఇట్టితరి ఒకనాటి రాత్రి వీరాభిమన్య నాటకమున కర్ణభూమిక వహించి, నిర్వహించి, వచ్చుచున్న నన్ను ఈ "ప్రజాకవి" – ఈయన మిత్రుడు హనుమాజీ తూరుపు కొండపై బంగరు వెలుగులు ద్యోతకమగు దనుక ఊర్వశీ నాటక కథావిధానము, పాత్రపోషణ, రసౌచితి, శబ్దలాలిత్యము ప్రబోధించి – ఈనాటక రాజమున ముఖ్యవ్యాఖ్యానకర్త స్థాన మలంకరింపుమని సన్నద్ధించిరి.

నిజముగా నీ ప్రజాకవిని పరిశీలించి, అర్థముచేసుకొని, ఆలోజించి చూచిన – 'ఇది అర్థించుటకాదు – నాకీ సదవకాశము నొసగ నిశ్చయించుకొని చేసిన 'త్యాగము' అని గ్రహించితిని. "ఒక్కొక్క పద్దియంబునకు నొక్కొక్క నెత్తుటి బొట్టుమేనిలో తక్కువగాక గూర్చితిని" అని విలపించిన ఫిరదౌసి మహాకవి మా జంపనలో స్ఫురించెను. వెంటనే "ఊర్వశిని ప్రదర్శించి తీరెదను" అని మా జంపనకు వాగ్దానమొసగితిని. ఈ వాగ్దానము పతిత్వలోకము మరువకుండురుగాక !... తదుపరి కారణాంతరములచే అనేక పరివర్తనలు చెంది, అనేకాభిప్రాయములకు లోనై – ఏ పవిత్రాత్మతో నన్ను ఏ పవిత్ర హృదయమున నిల్పుకొని ఈ కవి నా భూమికను సృష్టించెనో – ఆ భూమికనే నేను ధరించి, ప్రదర్శించి నా వాగ్దానము నిల్పుకొనగల్గితిని. ఇందులకు భగవానునకు – కవికి – సర్వదా కృతజ్ఞుడను.

నా భూమిక 'దూర్వాసుడు'. ఈ నాటక రాజమున మిత్ర నటీనటులు – శ్రీమతి పూర్ణిమాదేవి – కొచ్చర్లకోట – రెండుచింతల సూరవరపు – గంటయ్య – మల్లిఖార్జునరావుల సహకారము పొంద గలిగి ప్రప్రథమము రాజనరేంద్రుని ముఖ్యపట్టణమైన రాజమండ్రిలో ప్రదర్శించితిమి. ఆనాటిరాత్రి ప్రజానీకము; "ఈ ప్రజాకవి నన్నయ్యకవే" అనిరి. భారతము రచించిన నన్నయ్య ఏ పరమ ధర్మమును ప్రజలకు ప్రబోధించెనో, ఈ ప్రజాకవికూడ అట్టి పరమోత్కృష్ట ధర్మమునే ఈ నాటకమున ప్రబోధించెననిరి. ఏ త్యాగశీలుడు ఏశాంతమూర్తి – ఏ అహింసావేత్త – ఏ సత్యవ్రత తపస్వి – ఏగాంధీ మహాత్ముడు, ఇంతదనుక తను మన ధన ప్రాణముల వెచ్చించి దేనిని నిర్మూలింప కంకణము కట్టుకొనెనో – ఆ నీచాతి నీచ హేయ వ్యభిచార నిర్మూలనమును ప్రబోధించి, పరమోత్కృష్ట పతివ్రతా ధర్మ ప్రబోధ మీ ప్రజాకవి పాటించెననిరి.

'నాటక ప్రయోజనము నీత్యుద్ఘాటన – కళాపోషణ' అను విషయము లీ కవి ఎచ్చటనూ మరువలేదు. విభిన్న మతములకు చెందినవారు, విభిన్న సిద్ధాంతము లాచరించువారు, విభిన్నాభిరుచులు కలవారు, విభిన్నశాస్త్రీయ పరిజ్ఞానము కలవారు, విభిన్న

సాంప్రదాయము లలవరచు కొన్నవారు, విభిన్నాశయములుకలవారు దేశాభ్యుదయమునకై సమిష్టి కృషిచేసి, నాటక కళలోని రామణీయకతను దృష్టిలో నుంచుకొని ప్రబోధాత్మకమైన నాటకములనుగాని నవలలనుగాని, పద్యకావ్యములనుగాని, తుదకు బుఱ్ఱకథలనుగాని సృష్టించవలెనని ఈకవి ఏకైక ఆశయము. ఇందీయన సిద్ధహస్తుడై కృతార్థుడాయెను... యదార్థమునకు కవితా ప్రవంతులన్నియూ కళాసముద్ర సమాగమము చెందుసరికి, నామరూపములు లేని ఏకత్వము చెందునుకదా ? శ్రీ అరవింద మహర్షులు నుడివినట్లు లోకమున భిన్నత్వము లేదు; ఏకత్వమే – జాతికులమత విభేదములు స్వార్థమానవ కల్పితములే; భగవల్లిఖితములుకావు – సృష్టిలో ఉన్నదంతయు ఆనందమే; దుఃఖముకాదు – వెలుగే; చీకటికాదు – ప్రేమే; కామము కాదు... నైతిక సూత్రము తెగి మానవుడు పతితుడైనప్పుడీ భ్రమిత సృష్టిలో నాతనికి దుఃఖము, చీకటి, కామము ద్యోతకమగును ప్రేమ జగదభిదేవత – ప్రత్యణువూ దాని బానిస... ప్రకృతి ప్రణయ రసతరంగ ప్లావితమైనది. అందు వికసించే ప్రతిపూవూ తుమ్మెదకు క్రొత్తపాటనే వినిపించునను నూతనాశయముల నెన్నో మన జంపన తన ఊర్వశీ హృదయమున చిత్రించుకొనెను. కవి బుద్ధిలోనూ వయసులోనూ యువకుడే. తొలిరేకులు విప్పిన యౌవన మితనిది.

కాళిదాస మహాకవి లిఖించినట్లు మన జంపన విక్రమునకు ఊర్వశికాక మరొక ప్రేయసిలేదు; ఊర్వశికి విక్రముడు వినామరొక ప్రియుడూ లేడు. ఇరువురూ అనాఘ్రాత పుష్పములే. దేవదాసియగు ఊర్వశిని విక్రమునితో వివాహముచేయించి – స్త్రీ లోకమున ఒక ప్రేమ జ్యోతి నీకవి వెలిగించినాడు. స్త్రీలు కేవలము క్రీడావస్తువులు కారు; అందు వేశ్యలు – దేవదాసినులు – భోగలాలసలయి ఐహికాహ్య తుచ్ఛ సంభోగ వాంఛాఫల పరిదగ్ధజీవులుకారు – అని ప్రబోధించుటే ఈ కవి తన రచనా చమత్కృతితో ఈ నాటకమున పోయిన పోకడ. మానవజీవిత పరమార్థము ప్రేమోపాసనే; సృష్టిని ప్రేమించుట తప్ప జీవితమున ఇంకొక పనిలేదని ఈ కవిమతము. లలిత కళాప్రదర్శనమున స్త్రీ పురుషులిద్దరూ సమానులే. అందు స్త్రీజాతిలో దేవదాసినులు

సానులను తెగవారిని కేవలభోగలాలసలుగ భగవానుడీ ప్రపంచమున సృష్టించలేదు. సంఘముయొక్క కామముతీర్చు యంత్రములూకారు. వారు వీరననేల ఎల్లరనూ – స్త్రీజాతి నంతనూ ఒకే పరమార్థమున ప్రభువు జన్మింపజేసెను. గానము – వాద్యము – నాట్యము – ఏ స్త్రీ అయిననూ ప్రదర్శించి ఆనంద మొసగవచ్చును. కళారాధన ఒకరబ్బ సొమ్ముకాదు – అనునది ఈ నాటకమున ప్రబోధించు నీతి. విజ్ఞానులు నాయకులు – మహాత్ములు – వ్యభిచార నిర్మూలనార్థము పడు బాధలో ఈ కవి భాగము పంచుకొని, అష్టకష్టముల కోర్చి, త్యాగ శీలుడయ్యెనని వచించుట కెట్టి సందియమూ లేదు.

అధునిక నాటక పద్ధతుల ననుసరించి, "దేశమునుబట్టి కాలమునుబట్టి – రాజును బట్టి – భాషాలలితాంగి మారుటది సత్కవి సమ్మతము"ను తిరుపతి వేంకటకవుల ధర్మమును పాటించి, రచనా ధురీణతలోనేమి – పాత్రపోషణలో నేమి – నాటక నిర్వహణలో నేమి – ఉన్నత శిఖర మలంకరించిన జంపనను – "ప్రజాకవి" "కవికోకిల" అని వాడుటకంటె "అధునికనాటక చక్రవర్తి" అని పిలుచుట కెంతయూ అర్హుడని – ఈ "మహాకవి"కి సదా యిట్టి నాటకములను వ్రాయుటకు భగవానుని సర్వదా చేయూత నొసగమని కోరుతూ నాధన్యవాదము లర్పించుచున్నాను ...

ఈ మహాకవిని కన్న తల్లిదండ్రుల భాగ్యమే భాగ్యము. ఈ ప్రజాకవి కృతినందిన మిత్రుడు భవన్నారాయణ ధన్యజీవి. జంపన "విద్యాపతి" "నాదేశం" "కూలీదేరాజ్యం" "సుభద్ర" "చిత్ర" "వేమన" "బుద్ధ" మొదలగు నాటకము లచిరకాలమున ప్రదర్శింప బడి, ప్రజాభ్యుదయమునకు తోడ్పడుగాక! దేశాభ్యుదయమున కను వగు గ్రంధములే వ్రాయబడుగాక! పఠితృలోక మీ నాటకమును సహృదయులై పఠింతురుగాక! సెలవు —

ఇట్లు,

కోరుకొండ,
4—1—1948.

దూర్వాసుడు
N. V. L. నృశింహాచార్యులు

# అంకితం

ఏ సౌందర్య స్వప్నసీమా వేలాప్రణయ శాలల్లోనో -
ఏ మధురమంజుల మనోజ్ఞశరశ్చంద్రశుభోదయాలలోనో
నాలో ఒక తీయనివేదన మేల్కొల్పి నన్ను తనవానినిగా
జేసుకొన్న నా బాల్య మిత్రుడు ......
కళావతులను వైవాహిక ధర్మబద్ధుల నొనర్ప కంకణం
కట్టుకొన్న కళాజీవి - సంఘోపజీవి -
రాజమహేంద్రపుర వాస్తవ్యుడు
రసనిధి
అయిన
మా
## యస్. భవన్నారాయణకు

జంపన.

ప్రదర్శకులు:

# ప్రజాభ్యుదయ నాట్యమండలి
# ఏలూరు

— నటవర్గం —

ఊర్వశి : సంగీత సరస్వతి శ్రీమతి పూర్ణిమ.
విక్రమ : కళాకోవిద శ్రీ కొచ్చర్లకోట సత్యనారాయణగారు.
నారద : గానకళానిధి శ్రీ రెండుచింతల సత్యనారాయణగారు.
దూర్వాస : శ్రీ N. V. L నృసింహాచారిగారు.
ఇంద్రుడు, మంత్రి : శ్రీ జి. గంటయ్యగారు.
గీతానందుడు : శ్రీ యమ్. మల్లిఖార్జునరావుగారు.
మాయాదేవి : హాస్యరత్న శ్రీ సూరవరపు వెంకటేశ్వర్లుగారు.

నాట్యదర్శకులు: భరతనాట్యాచార్య, మహోపాధ్యాయ శ్రీ ఎస్. పుల్లయ్యగారు
సంగీత దర్శకులు : శ్రీ యస్. బాబారావుగారు
తబల: శ్రీ శ్రీరామమూర్తిగారు. క్లేరనెట్: శ్రీ వెంకటస్వామిగారు
ఫ్లూట్ : శ్రీ రెడ్డిగారు. దిల్రుబ : శ్రీ రాజుగారు.
దర్శకులు : మన జంపనవారే.

ఆర్గనైజర్ : శ్రీ జి. గంటయ్యగారు.

ప్రెశిడెంట్ : యమ్. జగన్నాధరావుగారు.

# ఊర్వశి

## మొదటిరంగం



(FRONT STAGE)

(ముందు తెరముందు)

వచ్చేపాత్రలు : 1. నారద మహర్షి.
2. దూర్వాసమహర్షి.
స్థలం : భూలోకం.
సమయం : ప్రాతఃకాలం.

(నారదుడు : ప్రేమోపాసకుడు; భక్తుడు; అనురక్తుడు. ప్రత్యణువు లోనూ ప్రణవ నాదమును వినగల రాగరససామ్రాజ్య చక్రవర్తి. శాంతిస్థాపనే అతని ఆశయం. సౌందర్యోపాసనే అతని ఆనందం. ప్రజాసేవే అతనిపరమార్థం. భగవదారాధనే అతని ఏకైకలక్ష్యం. ప్రవేశవిధానం : తంబుర మీటుకుంటూ, నృత్యగీతాల పరవశం చెంది పాడుకుంటూ ప్రవేశిస్తాడు.)

నారద : హే ప్రభో! కృపాబ్ధీ! నీ కరుణా కటాక్ష వీక్షణ రేఖా మాలికా సుధాశరశ్చంద్రికలచే, సకల చరాచరసృష్టి నావరించు కొన్న మాయాంధకారము విచ్ఛిన్నము సేయవా కరుణానిధీ! నీవు అరకంట తిలకింప అఖిల జగన్నిలయమొక అమృత మందిరము కాదా ప్రభూ! నీ అరుణారుణ మస్రుణ చరణములయందలి భక్తి - జీవిత మాధుర్యమునందలి రక్తి - శాశ్వతబంధ విముక్తి యందలి శక్తి - కేవల ప్రేమోపాసనచేతనే లభించుచుండ, నిరంతర యజ్ఞయాగాద్యున్నత క్రియాకలాపము లేలకో!

ప్రభో! నీ జగన్నాటకమునందలి పరమార్థము, అంతర్నాటకము నందలి అంతరార్థము, తపోనిష్ఠాగరిష్ఠులగు యోగి పుంగవులే గ్రహింపలేకున్న ఇక సామాన్యులకు లభ్యమా?

రసనిధీ! నీ లీల లద్భుతములు; నీ సృష్టి అనంతము. నీ కృపా వీక్షణము స్వర్గ సీమాంతవ్యాప్తము. ప్రభూ!

సీ. నీ పాదధూళికాదే 'అహల్యాదేవి'
కమృతత్వ మొసగె నీ అంధజగతి;
నీ చిరునవ్వుకాదే 'శబరి' కొసగె
శాశ్వతానంద ప్రశాంత పథము;
నీ ప్రేమ మాధుర్యమేకదా 'రాధ' ను
రసమయ సామ్రాజ్య రాజ్ఞి జేసె;
నీ కృపావీక్షణంబే కుబ్జ నొక
ముగ్ధమోహన సౌందర్య మూర్తిజేసె;
గీ. నీ సుధా దృష్టిచే కాదె నిఖిల సృష్టి
లలిత లావణ్య సౌందర్య నిలయమయ్యె;
నీ కృపా వృష్టిచేకాదె నిఖిల జగము
నిత్య నూతన 'కల్యాణ' నిలయమయ్యె.

(తనవైపు వచ్చు దూర్వాస మహర్షి ని చూచి)
అదిగో! దూర్వాస మహర్షి! అనవరత క్రతూత్సవాచరణ మగ్నమానసుడు. శాశ్వత స్వర్గాధిపత్య మపేక్షించు చున్నాడు.

(దూర్వాస ప్రవేశము.

దూర్వాసుడు : తపోనిష్ఠా గరిష్ఠుడు; కాని శాంతిహీనుడు. క్రతూత్సవాచరణుడు; కాని మోహాంధీభూత చేతస్కుడు. భక్తుడే; కాని వినయ విధేయుడుకాడు. శక్తిమంతుడే; కాని ప్రేమమూర్తికాడు. ఘనుడే; కాని కోపి.

(ప్రవేశ విధానము : మృగాజినధారి; కమండలు హస్తుడు; నిశితదృష్టి; నిరంకుశ భావము. లోకముపై నడచి వెళ్ళునంతటి కోవి.)

దూర్వాస : బ్రహ్మ మానసపుత్రా! వందనము.

నారద : దూర్వాస మహర్షీ! వందనములు. మీ శతక్రతు నిర్వహణము సమాప్తి చెందినదా?

దూర్వాస : చెందుట కేమికొరత? నారదా! ఎందరెందరో మహర్షులు, రాజర్షులు, దేవర్షులు, సాధించి సమాప్తిచేయలేని శతక్రతువింక నిరాటంకముగ నిర్వహింపబడ గలదు.

నారద : మానవ ప్రయత్నము ఫలింపవలెనన్న దైవము తోడ్పడ వలయును కదా! అయిన... ఈ క్రతు ఫలితము?

దూర్వాస : ఇంద్రత్వము.

నారద : అటులనా?

దూర్వాస : అవును; ఆ స్వర్లోక భోగ భాగ్యములు... ... ... ...

నారద : (ఆక్షేపణతో) ఆఁ ఆఁ...

దూర్వాస : వర్ణింప ఆదిశేషునకైన అలవియా? ఆకాశగంగా తరంగిణిలో అవగాహన మాచరించి - ఆ నందన సుందర మందార తరుచ్ఛాయలలో, రంభాద్యప్సర స్త్రీ పరిరంభణమున పరవశమంది - మధు సుధారసా స్వాదనమున మైమరచి, కళోపాసనలో కన్నరమోడ్చి, మత్తిల్లియుండ ఇటు అరవిచ్చిన తమ్మిరేకుల వీవనల విసరులే జవరాండ్రు - అటు పుష్పపాత్రలో క్రొందేనె పానకమందించు సౌందర్య రసోపాసినులు - ఎదుట ప్రౌఢాంగనా నృత్యకేళీ విలాసము - చుట్టును వీణా మృదంగ నినాదము - గానము - వాద్యము - నాట్యము - అబ్బా! ఏమి చెప్ప నా భోగప్రాభవము - (పరవశుడై పోవును.)

నారద : (నవ్వుచూ - ఆక్షేపణతో) నారాయణ! మహర్షీ! ఇవియా యజ్ఞఫలితములు? ఈ క్షణిక భోగమునకా ఈ శతక్రతు నిర్వహణము? లోక కళ్యాణార్థము, మానవ శాంతి స్వాతంత్ర అభ్యుదయముల కొరకాచరింపవలసిన మహావిధులం స్వార్థమున కుపయోగింతురా మహాత్మా! ఇందు పర మార్థమేమి? ప్రయోజన మేమి?

దూర్వాస : ఎవరి ప్రయోజనము వారపేక్షించిన సృష్టి కానాడే అభ్యుదయ ప్రాప్తి.

నారద : అది వాస్తవమే. కాని మానవ సృష్టి నుద్ధరింప మహాత్ముల స్వార్థత్యాగ మవసరము కాదా? మహర్షీ! తపో మహిమచేత, ధ్యాన ధారణ సమాధి నిష్ఠలచేత, ప్రేమోపాసనచేత, పండి పరిపక్వమైన రసానుభూతి చేత,...ద్రవించి, స్రవించి, విశాల వ్యాప్తము కావలసిన మానవ హృదయమును, ఏలకో సంకుచిత మొనర్చి, పాషాణ సదృశము చేయుచున్నారు?

దూర్వాస : నారదా! అనంతమైన సృష్టిలో అత్యల్పమైనది మానవ జీవితము. అది కేవల కర్మాధీనము. సృష్టి కర్మబద్ధము నారదా! అందుచే యజ్ఞయాగాది కర్మలాచరింపక ఎవ్వరునూ ముక్తిచెంద జాలరు.

నారద : పొరపాటు. ముక్తి కర్హులు నిష్కామయోగులు; ప్రేమోపాసకులు; భక్తులు; అంతియే. కర్మబద్ధులు కారు.

దూర్వాస : అట్లనా!!

నారద : తప్పక. స్వర్గసంపత్పరంపరలే వాంఛనీయములైన - చాలదా నిష్కల్మష ప్రేమానురక్తి? చాలదా ఆత్మానాత్మ విచక్షణ విజ్ఞానశక్తి? చాలదా నిరంతర ధర్మవ్రతదీక్షానియుక్తి? చాలదా అసమాన భగవత్పాదభక్తి?

గీ. సారహీనమౌ సంసార సాగరమున
రక్షుడౌ వాని తరియింప భక్తిచాలు;
చాలదే స్వర్గమునుజేర సత్యపథము?
వ్రతము లింకేల? ఈ శతక్రతువులేల?

దూర్వాస : అట్లయిన యజ్ఞయాగాది యోగములకన్న ఉత్కృష్టము లందువా 'భక్తి' 'ప్రేమ' లు...?

నారద : నిస్సంశయముగ. ఎట్లన—శతక్రతుఫలితము స్వర్గసామ్రాజ్య సార్వభౌమత్వమే. కాని తత్ఫలితానంతరము స్వర్గపతనము; మరల

భూలోకనివాసము; మరల మాతృపయోధర రసాస్వాదనము; మరల మరల జననమరణ చక్రనిబద్ధ తుచ్ఛజీవన హేయపథము— ఇంతియేకదా !

దూర్వాస : నీవు నిర్వచించు ప్రేమమూర్తుల కట్లుకాదా ?

నారద : కాదు. వారపేక్షించునది క్షణికమైన స్వర్గసుఖముకాదు; శాశ్వతానంద తేజోపథము... ...వారాశించునది రక్తికాదు; శాశ్వత బంధ విముక్తి. వారు వాంఛించునది అమరపథముకాదు; అనంత కైవల్యపథము. వారు కాంక్షించునది కామావృతమైన యోగనిష్ఠకాదు; నిష్కామ పవిత్రీభూతమైన ధ్యాననిష్ఠ. అది మీ కెట్లు లభ్యమగును ?

దూర్వాస : మాకలభ్యమైనది కూడ ఈ త్రిభువనముల కలదా ? అందువలననే కదా దేవేంద్రుడు మా శతక్రతు విధ్వంసనము చేయ లేకపోవుట !!

నారద : (నవ్వుచూ) అందుచేతకాదు ... తమరి స్వర్గాధిపత్యము అనతికాలము మాత్రమే యుండునని తెలిసికొనుటచేత —

దుర్వాస : అదెట్లు ?

నారద : స్వర్లోకమును శాశ్వతముగ పాలించినదెవరు ? మహర్షీ ! లోకము ప్రేమబద్ధము. సృష్టిని నిర్మించునది - నిర్మూలించునది ప్రేమయే. సృష్టిని పోషించునది - పాలించునది ప్రేమయే.

గీ. జనన మరణార్గళమీసృష్టి చక్రమెల్ల,
ప్రేమ కక్ష్యపై తిరిగెడు రేయి బవలు;
అణువు అణువున తాండవంబాడు ప్రేమ
ననుభవింపనిచో సృష్టి అర్థమగునె ?

దూర్వాస : నారదా ! వేయిచెప్పుము; ప్రేమ మహత్వ తత్వ మెవ్వ రెరుంగనిది. లోకము కర్మబద్ధమే; ప్రేమబద్ధము కాదు.

నారద : కాదో - అగునో - స్వర్గముననుండి తిరిగి వచ్చినప్పుడు తమ రనుభవమువలన చెప్పవచ్చును లెండు.

దూర్వాస : (ఆలోచనతో) ఏమి ! ఇంద్రుడేమైన 'కర్మ' కంటె, 'ప్రేమ' కెక్కుడు స్థానమిచ్చెనా ?

నారద : ఇంద్రుడే కాదు - ఉపేంద్రుడే కాదు; సర్వజ్ఞుని నుండి సామాన్యుని వరకు ప్రేమమూర్తికే అంజలి మోడ్చుచున్నారు.

గీ. స్వార్థ రహితమౌ ప్రేమకు జగములెల్ల
తలలు వంచి, పూజించి, నృత్యంబుసేయు;
ప్రేమ జగదభి దేవత; ప్రేమకెపుడు
దేవ దేవుడేకాని అధీనుడగును.

దూర్వాస : ఉహూం అప్సర స్త్రీలకుకూడ ఇదే భావమా ? వారలకు మా యెడలగల భక్తి ... ... ...

నారద : అద్భుతము; అచంచలము; అనంతము. అందుచేతనే ప్రేమోపాసకు రాలైన ఊర్వశి మీవంటి స్వార్థపరులను హేళన చేయుచున్నది.

దూర్వాస : హేళనా ? హేళన ... అహ్హాహా ...
ప్రతి సోమయాజికౌగిట పరవశమయ్యే పాపిని;
ప్రతియోగికి తన యౌవన సౌందర్య మమ్ముకొను కులట;
ప్రతి క్రతుక్రియాచరణ దీక్షాదక్షునకు తన శరీర మర్పించు పతిత;
ఆధ్యాత్మిక చింతనలేక, కామమున కుళ్ళి, కృశించి, నశించు పరమ పాతకి; ... ...

(కోపోద్దీపితుడై పళ్ళు పటపట కొరుకుచు)

గీ. పడుపు వృత్తిచే బ్రతికెడు పాపినైన,
వారకాంతకు ప్రేమ భావమ్ము లేద ?
కనుల సలసల మరిగెడు గరళమందు
కాచుపించునె ప్రేమ మార్గంబొకింత ?

అదియును గాక —

గీ. స్వర్గమున నుండ మారునా వారకాంత?
సహజ వృత్తులు మారునా స్థలము మార?
కాల సర్పంబు పాలనే గ్రోలుచున్న
కాటు వైచిన అమృతంబు కాన నగున?

నావంటి మహర్షినే హేళనచేసిన ఊర్వశి గర్వము సర్వము ఖర్వమొనర్చెదగాక.

నారద : అటులనే ఒనర్చవచ్చునుకాని_ఆ వారవనిత మీచే వంచింప బడిన మీ కెట్టి ఘనతయూ లేదు; కాని ఆ వనితచే మీరే వంచింప బడిన, లోకము క్రాకై కూయదా? మునిలోకము వంచినతల నెత్తగలదా? స్త్రీల పరీక్షింప ప్రయత్నించి పరీక్షింపబడని వా రెవరయ్యా మహర్షీ! అయ్యయ్యో!

ఉ. స్త్రీల హృదంతరాళి చివురించిన, ఘోర తమాల వాటికన్,
ఏల తరింప జూతు? కనురెట్టుల కన్నడు కారు చీకటిన్?
బాల కరాళ వాగ్విష విభంగము లందున స్నానమాడగా
ఏల తలంచెదో ముని - ఏల విషాగ్నుల త్రావ నెంచెదో!!

దూర్వాస : ఏమైన కానిమ్ము; ఊర్వశిని పరీక్షించి పరాభవించియే తీరుదును.

నారద : ఒకవేళ మీ శతక్రతువు భంగమైన...

దూర్వాస : కానిమ్ము... (కొంతదూరము పోవును)

నారద : మహర్షీ! ఒక్కమాట... మీ మీ కలహఫలితములకు మాత్రము నన్ను కారణ భూతుని చేయరాదు సుమా!

దూర్వాస : ఇందు నీదేమున్నది?

నారద : మహర్షీ! మరొక్కమాట. మీరు పరిశీలింప వలసినది ఇంద్రునికాదు; ఊర్వశినీ కాదు; ప్రణయ తత్వమును...

దూర్వాస : తెలియును; వారల గర్వమూ తెలియును; ఇంద్రుని మర్మమూ తెలియును.

(అతి కోపమున వెడలిపోవును.)

నారద : నారాయణ ! ఓ దేవదేవా ! ఇంక ఈ ప్రణయనాటకమున కిదే ప్రాతి పదికగ తీసికొని ఎన్ని రసమయ సన్నివేశముల సమకూర్తువో కదా ! ! ఇటులోకము కర్మబద్ధమని దూర్వాసుడు; అటు లోకను ప్రేమబద్ధమని ఊర్వశి; ఇరువురి శక్తి సామర్థ్యముల యదార్థము ద్యోతకమగుటచే సృష్టికొక చక్కని నూతన రస వత్తర నాటక మేర్పడగలదు.

శా. బాగోయీ నటకావతంస ! కడు దుష్ప్రాప్యంబు నీ వేషముల్ !
ప్రాగర్థంబుల లెక్కపెట్టుకొన జాలన్నేర రీ మానవుల్;
యోగీంద్రాదు లెరుంగ జాలసి త్వదీయోద్యోగ పాత్రాదు లా
హా ! గాంచంగల వారలయ్య తవ మాయాచ్ఛాదనంబుండగా ! !

గీతం

రాధా .మోహన ! హరే ! అఘహరే ! ॥రాధా॥

దేవా ! జీవనాధారా ! ॥రాధా॥

రాధా హృదయ లీలా లోలా !
రావా ! దేవ ! కృపాకరా !
మునిజనదాతా ! మోక్షప్రసాదిత !
సుధాలయా ! ప్రభో ! రారా ! ॥రాధా॥

(పాట పాడుకుంటూ వెడలిపోవును.)



# ఊర్వశి

## రెండవ రంగం



(BACK STAGE)

వచ్చే పాత్రలు : 1. ఊర్వశి
2. ఇంద్ర
3. దూర్వాస
4. నారద

స్థలం : స్వర్లోకం
సమయం : సాయంసమయం
సందర్భం : వసంతోత్సవ కేళీవిలాసం

ఇంద్రలోకము : సురలు, సురాంగనలు వసంతోత్సవ కేళీవిలాసమున నృత్య మొనర్చుచుందురు. ఆటపాటల పరవశులై, నవనవోన్మిషితజీవన మాధుర్య మనుభవించు చుందురు.

ఇంద్ర : చక్రవర్తి; ధర్మమూర్తి.
స్వార్థపరుడే; కాని కరుణాళువు.
కళాప్రియుడు; రసిక చక్రవర్తి.

ఊర్వశి : నవయౌవన విలాసిని; ప్రేమోపాసిని;
ఆనందరసోల్లాసిని; అనురాగమయి;
నృత్యకళారాధిని; గాయిని;
సదయ హృదయిని; మృదుల భావని.

## నృత్యగీతము

మోహించుపరా ! ప్రేమ వీణా !
మొనలు తీరునా హృదయ నికుంజము ॥మోహించుపరా॥
ఆశాకరముల మిన్నులు ముట్టి
తెన్నులు తెలియని ప్రేమ సీమలో
ఊగరా.........ఉయ్యాలా...... ॥మోహించుపరా॥

వయసూ, వలపూ, వాడక మునుపే,
ప్రణయ గీతము పాడుమురా !
తారకలన్నీ రాలి పోవగా,
దశదిశలన్నీ ఊగిపోవగా,
పున్నమ సంద్రము పొంగి పొరలగా
కన్నె వలపే కరగి పారగా,
పాడరా! ఆడరా ! రారా !

(నృత్యకళా ప్రాభవము : దూర్వాస ప్రవేశము. సురాంగనలను నిశితముగా చూచుచూ, దూర్వాసుడు ఇంద్రుని కభిముఖముగా వెళ్ళును. ఊర్వశి ఒక అప్సరస ప్రక్కకు నాట్యభంగిమలో వెళ్ళి నిలబడి, వంగి దూర్వాసునివంక చూచుచుండును.)

ఇంద్ర : ఆర్ష ఋషిచంద్రమా ! ఇదే మా స్వాగతము. దయచేయుడు. భూలోకమున సర్వమూ కుశలమేకదా ?

దూర్వాస : నీ మాటనే బ్రహ్మవాక్కుగా భావించి, దానినే నిశిత శాసనముగా శిరసావహించి, త్రిలోకములూ వర్తించు దుస్థితి నుండగా నీ చక్రవర్తిత్వమున కుశలము గాకేమున్నది ?

ఇంద్ర : అదేమి ?

దూర్వాస : ఏమున్నది ? నిరంతర యోగ నిష్ఠాగరిష్ఠులుగాక, యజన యాగాది సత్కర్మ లాచరింపక, కేవల ప్రేమోపాసకులైనంత మాత్రమున స్వర్గార్హత నొసంగుచుపవలె...

ఇంద్ర : అర్హత ఎవరి శక్తిసామర్థ్యముల ననుసరించి వారికి వచ్చునదే

కాని, ఒకరిచ్చునదీ మరొకరు పుచ్చుకొనునదీ కాదు. స్వర్గము ధర్మబద్ధము.

దూర్వాస : అయిన—

ఇంద్ర : ఇందెల్లరకూ తావుకలదు.

దూర్వాస : జాతి కుల మత తారతమ్యములులేవా ?

ఇంద్ర : లేవు; అవి మానవ కల్పితములే; దైవ నిర్మితములు కావు.

గీ. మనుజు లందరి జన్మ సమానమగుట,
వారు వీరను భేద మావంత లేదు;
మనుజు లందరిలో పరమాత్ము నెవడు
గాంచ గల్గునో - వాడె మోక్షంబు చెందు-

దూర్వాస : మోక్షమునకు వేద చోదిత కర్మాధికార మవసరము లేదా ?

ఇంద్ర : అవసరమే. అదొక మార్గము. అట్లుకానిచో కర్మాధికారము లేని శూద్రుల గతేమి ?

దూర్వాస : వారిగతి దుర్గతే; పతితులు పతితులే...

ఇంద్ర : పతితులు పావనులు కావలదా ? మహాత్మా !

గీ. పతితులగు వారి మీరె కాపాడకున్న
ఎన్ని జన్మలకైన తరింప గలరె ?
ప్రాజ్ఞు లెవరైన ప్రజల కాపాడకుండ
స్వార్థ పరులైన - మోక్షంబు బడయగలరె ?

మహర్షీ ! స్వర్గ ధామమును జేగుటకు మార్గము లనంతములు. అందేమార్గ మైననూ ఒక్కటే. కర్మిష్టులు కర్మయోగమున - భక్తులు భక్తియోగమున - జ్ఞానులు జ్ఞాన యోగమున తరింతురు. తరించుటెల్లరకు తథ్యమే.

దూర్వాస : అట్లయిన కర్మిష్టులు - ప్రేమోపాసకులు ఒక్కటే ?

ఇంద్ర : అవశ్యము. అందెవరి భావము పండి, పరిపక్వమై, రసాను భూతి నొందునో వారికీ స్వర్గార్హత లభించును.

గీ. పండి పరిపక్వమైనట్టి ప్రణయ మధువు
అనుభవింపగ నోనె మోహాంధు డెపుడు ?
వలపు కిన్నెర మీటుచు పాటపాడు
భాగ్యమేరీతి చెందు సమ్రాజ్ఞుడిలను ?

దూర్వాస : ఏమీ ఈ విపరీత నిబంధనలు ? ఇవి నీవు నిర్మించినవా? మరొకరు నిర్మింపగా నీవు పాలించు చున్నవా ?

ఇంద్ర : రాజ్య నిబంధన లెన్నడూ రాజుచే నిర్మింప బడవు. వానిని నిర్మించునది ప్రజలు; పాలించునది రాజు; ప్రజానుసరణమే పరిపాలన; నిరంకుశత్వమున కిందు తావులేదు. యదార్థమునకీ చతుర్భువనములా ప్రేమదేవతాధీనములే.

దూర్వాస : (ఆశ్చర్యమున) ఏమిది? నారదుడూ ఇట్లే చెప్పుచున్నాడే! !

ఊర్వశి : (భయకంపితయై) ఏమీ ! నారదుడు మీ చెంత కేతెంచెనా?

దూర్వాస : ఆఁ అతడే ఈనా రాకకకూడ కారణము. ఈ కర్మప్రేమల గల వైరుధ్య భావముల తారతమ్యము లా మహానుభావుని బోధా ప్రసాదితములే. తదన్వేషణార్థమే నేనిచ్చటి కరుదెంచుట.

ఇంద్ర : మీరిచ్చట నూతనముగా అన్వేషింప దగినదీ – అభ్యసింప దగినదీ ఏమున్నది ?

దూర్వాస : ప్రేమ ... నారదుడు నుడివిన ఆ ప్రేమనే ఉపాసించి ఇంద్రత్వము పొందెదనుగాక ! ఇంక శతక్రతువేల ? ప్రేమోపాసనయట ... ప్రేమోపాసన ... సకలరాజన్య కిరీట మకుట రత్నరాజిత నీరాజ పాద నీరేజుడు – సకల విద్యాసముద్రుడు – త్రిభువనముల ఈక్షణమాత్రమున ప్రకంపింపచేయగల ఈ దూర్వాసునకు ప్రేమోపాసన ఒక బ్రహ్మవిద్యయా ? ప్రేమోపాసనట – ప్రేమోపాసన.

ఊర్వశి : మహాశయా ! క్రతుదీక్షా మధ్యముననా మీ ఈ సాధన ?

ఇంద్ర : ఇస్ ... ఊర్వశీ ! ఇంకనూ క్రతుదీక్షయేమి ? ప్రేమోపాసనే మన దూర్వాస మహర్షి ప్రస్తుత కర్తవ్యము – అవునా ?

దూర్వాస : అవును ... (దేవకాంతలను చూచుచూ) ఆ గంగాసైకత స్థల ప్రాంతమున, ఆ నవమల్లికాకుసుమ సంభరిత మనోజ్ఞ వేదిక పైన, ప్రేమోపాసనచేయుటకు – ఈ దేవకాంతలలో రంభ ! (వలదని తలనూపి) మేనక ! (వలదని తలనూపి – ఊర్వశివంక చూచి ఆమె తలవంచుకొనగా ఆశ్చర్యముచెంది) ఏమి ఊర్వశీ తలవంచుకొంటివి? (ఆమె నిట్టూర్చును) హృదయ మంతయు కదలి పోవునట్లు నిట్టూర్చుచున్నావే ?

ఇంద్ర : ఏమియూ లేదు. ఎంతయో శ్రమతో అచ్చటనుండి ఇచ్చట కేతెంచిన మిమ్మెట్లా నందింపచేయగలనా అని –...

దూర్వాస : ఆలోచించుచుండెనా ?

ఇంద్ర : అంతియే.

దూర్వాస : (ఊర్వశి వంక నవ్వుతూచూచి) ఏమి ఊర్వశీ ! కళా చతురవు; నీవే మమ్మానందింపజేయలేకున్న ఈ దివి భువికంటె కళానిలయ మెట్లగును ?

ఊర్వశి : అవును.

దూర్వాస : మహేంద్రా ! ఆ నవమల్లికా మధుర మంజులమండప ప్రాంగణమున– పుష్పశయ్యా నిర్మాణము గావింపుము ... తనుపరి సర్వాలంకార సంశోభిత నొనర్చి ఊర్వశిని ...

ఇంద్ర : పంపెదను గాక.

దూర్వాస : (ఊర్వశి వంకచూచుచూ) శుభావాప్తిరస్తు. (వెడలును)

ఇంద్ర : ఊర్వశీ ! నీ పుణ్యము పండినది. అలంకార శోభితవై.

ఊర్వశి : ఆ మహర్షి హృదయ పంజరమున పక్షిని కావలయునా ? వారి కౌగిట ఖయిదీ కావలయునా ? వారి ఉచ్ఛ్వాస నిశ్వాసముల ఊపిరాడక ఉరి కావలయునా ? వారి పాదములకు మా యౌవన కదుష్ణ రుధిరమును పారాయణ సేయవలయునా ? మహేంద్రా !

చ. ఇది తగునే? మునీంద్రులు శపింతు రటంచు కళాభిలాషతో
బ్రదికెడి మమ్ము లంచముగ వారి కొసంగుట ప్రేమ ధర్మమే?
సుదతుల కంటి నీరొలుక జూచుట భావ్యమె? వార కాంతకున్
హృదయము లేదె? ప్రేమ మధువించుక త్రావగ నోచదే ప్రభూ!

(ఆవేదనముతో) మన్నింపుము మహాశయా! మీరు ధర్మజ్ఞులు- సర్వజ్ఞులు - రసజ్ఞులు - అట్టి మీకే స్వార్థపరత్వమున్న ......

ఇంద్ర : ఇందు స్వార్థపరత్వ మేమున్నది?

ఊర్వశి : లేదా? మా జీవన సర్వస్వమును వారికంకితము సేయుటలో స్వార్థపరత్వము లేదా?

గీ. ముక్కు పచ్చలారని కడు ముద్దరాల,
మూడు కాళ్ళ ముదుసలి దుర్మోహమెట్లు
తీర్చి - దనియించి - సౌఖ్యంబు కూర్చుదాన?
మనసు తీరునా - హృదయంబు మండువేళ?

(క్రోధమూర్తియై) మీకీ స్వర్గాధిపత్యమే శాశ్వతముగ అనుభవించు ఆకాంక్షయే లేనిచో - నన్ను వారి కర్పించుటకు మారు మీ రత్నమయ సింహాసనమే వారి కర్పింపరాదా? వారి శత్రకతు విధ్వంసనమునకు నా కళాజీవనము నీ రాజనము సేయ వలయునా?

ఇంద్ర : నీ రాజన మేమున్నది? ఇది నీ విధి.

ఊర్వశి : కాదు ప్రభూ! కాదు. మావిధి నృత్యగీతముల మిమ్ము దనియింప జేయుట.

ఇంద్ర : రంభాద్యప్సర స్త్రీలకంటె నీ వెక్కువా?

ఊర్వశి : ఎక్కువ తక్కువలు మనసును బట్టి నిర్ణయింతురు గాని వయసునుబట్టి నిర్ణయింతురా? వారివలె హృదయ మింకనూ మూగవోలేదు ప్రభూ! మూగవోలేదు. దాని యందలి అమర వీణ ఇంకనూ ఆనందగీతిక లాలపించుట మానలేదు.

ఇంద్ర : ఇది వారకాంత ధర్మము.

ఊర్వశి : వారకాంతకొక ధర్మము, కులకాంత కొక ధర్మముండునా? ప్రభూ !

యావత్ ప్రపంచమున నున్న స్త్రీజాతినంతనూ పాలించు ధర్మమొక్కటే – అదే సౌశీల్యము.

స్త్రీకి సౌశీల్యమే ఆభరణము;
సౌశీల్యమే అంగరక్ష;
సౌశీల్యమే ఆత్మతేజస్సు;
సౌశీల్యమే ... ...

ఇంద్ర : ఇక చాలు నీ ప్రభు తిరస్కారము.

ఊర్వశి : ప్రభు తిరస్కారము కాదిది; ప్రజ్ఞాహృదయార్తి నివేదన. జీవస్మరణ మృత్యు సంధ్య.

స్త్రీహృదయ కుహరాగ్ని విస్ఫురత్ జ్వాలా జటా కీలికా చ్ఛటాచ్ఛటలు – ప్రణయజీవులకు పరీక్ష.

ఇంద్ర : పరీక్షకాదు; రసోన్మాదులకు శిక్ష.

ఊర్వశి : శిక్షకాదు; ఆత్మాభిమానులకు అంగరక్ష; అను రాగ మూర్తులకు ఆరని దీక్ష...

ఇంద్ర : (ఉగ్రుడై) ఊర్వశీ! ఆజ్ఞా బద్ధవుకమ్మ...

ఊర్వశి : చిత్తము (నిట్టూర్చును)

ఇంద్ర : దూర్వాసుని కడకేగుము ... (వెడలును)



# ఊర్వశి

## మూడవ రంగం



(FRONT STAGE)

(ఊర్వశి, రంభా, మేనకలు ముందునకు వచ్చెదరు.
తెర వెనుకగా జారును.)

ఊర్వశి : ఏగవలెను; ప్రభునాజ్ఞ; ఏగవలెను. ఎచ్చటికో! మృత్యు కుహరమునకో! ప్రేమసౌధమునకో! ఆశాచంద్రిక లారిపోవు అశాంత తమోగర్భాంతికమునకో! అమృత హృదయరస ప్లావిత పవిత్రమందిరాంతికమునకో! ఎచ్చటికో! ఏ మార్గమునకో!

రంభ : అందరూ పోవు మార్గముననే...

ఊర్వశి : ఆత్మశక్తి నశించిన కదా!

ఉ. నీతిని మంటగల్పి, అవినీతికి మానస మమ్ముకొన్న స్త్రీ
జాతికి ముక్తిలేదు; గడసాని యెరుంగదు ప్రేమ మాధురీ
శీతల చంద్రికా లలిత జీవిత మందలి శాంతి; ఎవ్వరేన్
పూతి పసిండివంటి వలపున్ వృధసేతురే మోహచిత్తలై?

నారద : (ఉత్సాహముతో ప్రవేశించి)

చ. భళి భళి ఊర్వశీ! తగినపాఠము చెప్పితి; దేవకాంత లా
దల ధరియించి ప్రేమ మధు ధామము చేరెడి మార్గమంతయున్
వెలుగగ జేసినావు; ప్రభవించెనె వారిలో ప్రేమ రేఖ? ఆ
వెలదుల మార్పు నీతరమె? విశ్వమె మారిన మారబోదురే?

తెరచాప చిరిగి, – చుక్కాని విరిగి, – పడవ ఒరిగి, – మహా సముద్ర మధ్యమున ఫెళఫెళార్భటులతో మునిగిపోవుతరి, పడవ లోనివారు ములిగి పోవరా?

చ. వడివడిపోవు మోహరస వాహిని మున్గిన తేల జాలకే
సుడులయి - సున్నలై - బ్రతుకు శూన్యమునందలి కారుచీకటై -
ముడివడు జీవితవ్యధల మూల్గుచు నుండెడివారు - ఎన్నడేన్
వెడలగ జూతురే ప్రణయ వీధుల - వెన్నెల వెల్గు బాటలన్ ?

ఊర్వశి : సత్యమే. ప్రేమదేవాలయ కనకగోపుర కాంతి ప్రభలు కనులార దర్శించిన వారెవ్వరూ, ఈ పాత ముళ్ళ మార్గమున పోరు... మహర్షి ! ప్రేమమయ జీవితమును గడుపనున్న నన్నాశీర్వదింపుము ...

నారద : నిన్నాశీర్వదింప నేనేకాదమ్మా ! త్రిమూర్తులూ సంసిద్ధులై యున్నారు. భయము లేదు.

ఊర్వశి : భయములేదనే నాలో ఎవ్వరో - ఏ ప్రణయ పరిపూత చరిత్రులో - వేయివేల గొంతులతో ధైర్యము గొలుపుచున్నారు-కాని - ఏలనో ఈనాడు సృష్టిచక్ర భ్రమణముకంటె నాహృదయ భ్రమణమతి తీవ్రగతి చరించుచున్నది.

నారద : చరింపదా ? త్రిలోకాధిపతి, సకల రాజాధిరాజ కిరీట కోటీరాంచిత మణిగణ శోభాప్రభా భాసమానోన్నత పవిత్ర పాద పీఠుడు - లలిత కళావిలాస లాలస మధుర మోహన జీవన తత్పరుడు - మహేంద్రుడే - తన కళామూర్తిని కాలరాచి, కంటగత బాధా జీవితగాధలో శిథిలమొనర్చుచుండ, హృదయము తీవ్రగతి చరింపకుండునా ?

ఊర్వశి : (ఆతృతతో ... ఆలోచించినట్లు నటించిన తరువాత) మహర్షి ! దూర్వాసు నిచ్చుటకు ...

నారద : (నవ్వుతూ) పంపినదినేనే. ఈ జగన్నాటకమున ప్రేమ మహాత్వ తత్వ మెరిగింప నిన్ను నాయికగా చేసినదినేనే; నేనే ఈ ప్రణయ నాటకమునకు నాందీ ప్రస్తావనల చేసినది; ఇక నాటక మాడించుట - రక్తికట్టించుట-శుభాంతముగా ముగింపజేయుట - ఆదర్శకుడైన భగవానుని అధీనము.

ఊర్వశి : భగవానునికృప.

నారద : ఊర్వశీ ! మీా సంఘటనల కేదో మహ త్తర ఫలితముండక పోదు. సృష్టిలోని దుష్టప్రవృత్తులు ఏపవిత్ర హృదయమునైనను, నాశనమొనర్ప సంకల్పించిననాడే, అనిర్వచనీయమైన అద్భుత శక్తులు, అనుల్లంఘనీయములైన ఆదర్శములు ఆవిర్భూతములై, విశ్వకల్యాణమునకు మార్గము చూపితీరును. ఇక నీ ప్రయత్నము నకు కడంగుము. ప్రేమదేవత నిన్నాశీర్వదించును గాక !

ఊర్వశి : ప్రేమ దేవత ఆశీర్వదించునా — ఆహా ! ధన్యురాలను ధన్యురాలను...

గీ త ము

ధన్యనైతి – తాపసీంద్రు
దర్శన సౌభాగ్యముచే – ॥ధన్యనైతి॥

యుగయుగాల మూగబాధ,
తరతరాల శృంఖలాలు,
విచ్ఛేదం బొనరింపనె ?
సచ్ఛీలము ప్రకటింపనె ?

భీతిలేని స్త్రీజాతికి
నీతి జ్యోతి చూపింపనె ?
సత్య పథము సమకూర్పనె ?
నిత్య 'శాంతి' నెలకొల్పనె ? ॥ధన్యనైతి॥

(నారదునకు నమస్కరించి వెడలిపోవును)

నారద : ఊర్వశీ హృదయ విపంచి తంత్రులు భగ్నమైన, నాటి అప శ్రుతులు భగ్నమైన, నాటి అపశ్రుతులు వలయాకృతములై, త్రిభువనములు నిండి నిబిడీకృతములై ప్రేమదేవత హృదయమునే కూకటి వ్రేళ్ళతో పెగిలించి, దిశాంచలములకు విసరివైచి, పెంధూళి కలిపివేయక విడచునా ? ఊర్వశీ ప్రేమమూర్తి కెట్లపజయమగునో చూచెదగాక ! ఓ దీనావనా ! దీనులను రక్షించు భారము నీదే సుమా ! (తన్మయమున పాడుకొనుచూ వెడలును)

---

# ఊర్వశి

## నాలుగవ రంగం



(BACK STAGE)

పాత్రలు : 1. దూర్వాసుడు.
2. ఊర్వశి.

స్థలం : స్వర్లోకం.

సమయం : సాయం సమయం.

సందర్భం : దూర్వాసుని ప్రణయ పరీక్ష.

(నందనవనం – ఊర్వశి విషాదవేదనలతో పాడుకొంటూ ప్రవేశించును.)

### భగ్నగీతం

భగ్నమైనా హృదయ వీణా !
పాడలేదోయ్ ప్రణయ గీతము... ॥భగ్న॥

ఆరిపోయిన దీపంబెటులా
పారదోలును చీకటిరేఖల ?
జారిపోయిన పూలరేకులు
చేరకల్గునె వృంతమందున ?... ॥భగ్న॥

అగ్ని వర్షము కురిసెడువేళ
ఆశాపాత్రను చాచగనేల ?
రక్తగంధము పంచెడువేళ
ప్రణయశిరమును వంచగనేల ?... ॥భగ్న॥

కూలిపోయే దేవళములో
కుమిలిపోయే పాడుబానిస,
మృత్యువదనము నందునిలచీ
ప్రేమభిక్షను వేడనేలా,... ॥భగ్న॥

(పాట ఆఖరయ్యేలోపు దూర్వాసుడు ప్రవేశించును.)

ఊర్వశి : (నృత్య భంగిములో) మహర్షి ! వినయాంజలి.

దూర్వాస : కాదు; ప్రణయాంజలి. ప్రణయరసతరంగ ప్లావితమైన ప్రకృతిలోని ప్రతివ్యక్తి కర్తృత్వము ప్రణయోపాసనేకదా !

ఊర్వశి : కాదని రసజ్ఞు లనగలరా ?

దూర్వాస : అయిన ఈ వెరపేల ? నా హృదయ దేవాలయ ద్వారములు తెరచు కొంటినే ! హృదయాంతరమున నిర్మలానురాగ సింహాసన మేర్పర్చు కొంటినే. అంతర్భావప్రు ముక్తాఫల శ్రేణితో అలంకరించుకొంటినే. రావేల ! ప్రణయ సింహాసన మధివసింప వేల ? ఊర్వశీ ! నీవు నా ప్రేమ దేవతవు కాదా !

ఊర్వశి : (ముఖము నావలకు త్రిప్పి) మహర్షి !

దూర్వాస : అబ్బా ! ముఖము వంచకు ఊర్వశీ !

గీ. ముఖము వంచిన నాయెద మూగవోయి,
జన్మ జన్మాల నలుగు పాషాణ మగును;
కనులు మూసిన సృష్టికే కాళరాత్రి;
కానగానొనె ప్రణయ మార్గంబొకింత !!

ఊర్వశి : (దూర్వాసుని అరకంట తిలకించి) మహామునీ !!

దూర్వాస : అట్లు చూడుము. ఊర్వశీ ! కనులు మూసిన అనంత కైవల్యమే కరిగిపోవును. కళా సౌందర్యమే కదలి పోవును. రెప్ప వాల్చితివా, కనుపాప నారూపు చెరిగిపోవదా ? నా జీవితమే మూగవోవదా ప్రేయసీ !

ఊర్వశి : మహర్షి చంద్రమా ! తపో మహిమచే రసానుభూతిని చెందిన రసజ్ఞులు. మీరు ఆరాధించ వలసినది నన్నా ?

దూర్వాస : నిన్నే; ముక్తి కాంతను; జీవనోత్తేజినియగు ఉమఃకాంతను.

ఊర్వశి : రసోన్మాదమున వారకాంతకూడ ముక్తికాంతవలె కన్పింప వచ్చును. కాని – ఆ రసోన్మాదమే పోయిన—

దూర్వాస : పోనిమ్ము; జీవితమేపోవును; భయమేల ?

ఊర్వశి : మీ అనురాగమునకు నా అభివాదనము.

దూర్వాస : అయ్యో ! అభివాదనమేల ఊర్వశీ ! ప్రేమ దేవాలయమున మన మిరువురము పూజారులమే. ఇరువురమూ ఏకశయ్యపై, ఏకాగ్రతచెంది, ఏకోపాసనచేసి, ఏకోన్ముఖముగా భావనా స్రవంతుల స్రవింపజేసి, రసానుభూతినిచెందు ప్రణయ కావ్య కలాపమందు, నీవెవరవు ? నేనెవరిని ? అంతయూ ఆనందోబ్రహ్మ.

ఊర్వశి : మీరు మహాత్ములు.

దూర్వాస : కాదు; ఊర్వశీ కాదు. అట్లయిన పాషాణ సదృశమై ఎన్నడూ కరుగని నా హృదయ మీనాడు కరిగి, కరిగి, వాగై, వాహినియై, వార్నిధియై, మిన్నులు ముట్టి ప్రళయ తాండవము చేయుటకు కారణమేమి ?

ఊర్వశి : ఊహాతీతము; అనుభవైక వేద్యము.

దూర్వాస : అవును. ప్రణయినీ బాంధవ్య మాధుర్య మనుభవైక వేద్యమే ఊర్వశీ ! ప్రేమ తెరచిన గవాక్షములనుండి, నా చూపులు పరువులెత్తి, నీ సౌందర్యోపాసనలో ఈ బాహ్యసృష్టినే మరచిపోయినవి. అనుగ్రహింపవా ?

ఊర్వశి : నిగ్రహానుగ్రహముల కిందేమున్నది ? రాతిగుండెనుండి రాగములు వినగలరా ?

దూర్వాస : అనురాగమయీ ! నీవు అడుగు మోపినచోట అమృత నిలయముకాదా ?

ఊర్వశి : మహర్షీ ! ప్రేమ గంగాతరంగిణీతీరమున నిలచిన ప్రేమజీవిని నేను.

దూర్వాస : ఆ ప్రేమ గంగావతరణమునకు ప్రయత్నించు భగీరథుడను నేను.

ఊర్వశి : కావచ్చును; కాని – ప్రేమ పవిత్రత చెందుటకు ప్రేమీ ప్రేమికుల హృదయ విపంచితంతులోకే శ్రుతికి మేళవింపవలెను కదా !

దూర్వాస : అవును.

ఊర్వశి : అట్లుకానిచో!

దూర్వాస : కాకపోవుటేమి ? సాధనచే శ్రుతి మేళవించును; రాగముద్భవించును; అప్పుడేలయ; వెనువెంటనే తాళము –

గీ. ప్రకృతిచైతన్యలక్ష్మి దేవాలయమున,
ప్రత్యూషస్సమయము – హిమవర్షమందు –
కడగబడు బొడ్డుమల్లెల కాంతిలోన
కలసిపోరాదె ఎడదలు కలియజేర్చి ?

రా ! ప్రేయసీ! రా ! మన మధుర స్నేహము ఈవిశ్వమునకే ఒక నూతనాలంకారము కాగలదు.

ఊర్వశి : మీ స్నేహము నిరాకరింపను. కాని – మీ వాంఛ నంగీకరింపను.

దూర్వాస : అట్లనరాదు ఊర్వశీ! సకల మునిగణ సురాసుర సంస్తూయమాన సర్వోత్తమ బ్రహ్మవిద్యా గరిష్ఠుడను నేను – అనుపమాన కళావిలాస లాలస మధుర మోహన సౌందర్య త్రైలోక్యారాధిత ఏకైకశృంగార నర్తకివి నీవు – మన సంధానమున కలగబోవు కుమారుడు నా పాండిత్యము, నీ కళాసౌందర్యములతో సృష్టికొక అపూర్వ తేజో స్వరూపుడగును.

ఊర్వశి : మనము కర్తలమా మహానుభావా! వానికి నా విజ్ఞానము, మీ రూపము కలిగిన మీ ఉద్దేశము నిష్ఫలముకాదా ?

దూర్వాస : నిష్ఫలమా ? నా ఉద్దేశమే నిష్ఫలమైన త్రైలోకములస్థంభింపచేయనా? భగవానుడే పాషండుడైపోడా? రా! ఊర్వశీ రా!

స్వప్నావస్థ యందైననూ నిరుపమాన సౌందర్యవనితా లాల్యేక్షణా స్ఫురణ్మాధురీ మధురస ప్రవాహములనైన వీక్షింప నిషేధించిన ఈ కఠిన కర్కశ క్రతుదీక్ష – మాననీయ మానవ సౌందర్యమంతయూ శిథిలమొనర్చు ఈ విభూతి రేఖలూ – హృదయగత సహజ సౌహార్ద్రమార్దవముల నిగూఢపరచి, నిగ్రహానుగ్రహమే శరణ్యమని ప్రబోధించు ఈ రుద్రాక్షమాలలు – యావత్ సృష్టి సౌందర్యమునకు అంధునిజేసి, యజ్ఞయాగాది యోగనిష్ఠాగరిష్ఠతయే పరమార్థమని ప్రబోధించు ఈ కర్కశ యోగదండము –

ఇవన్నియూ ఈ క్షణముననే విసర్జించితిని – ఇంక నే నర్థించునది బ్రహ్మోపాసనకాదు; ఈశ్వరోపాసనకాదు; విష్ణోపాసనకాదు; కేవలము ప్రేమోపాసన. ఇక నా జీవనరథమును నడుపునవి భగవద్ధ్యానసనములు కావు; నీ వాలుగన్నులు వెలుగు ప్రేమ జ్యోతులే. రా ఊర్వశీ! రా!

ఊర్వశి : మహర్షీ! ఇట్లు మోహాకృష్టులగుట ధర్మమా? ఇది కేవల పతన హేతువు కాదా!

దూర్వాస : పతనము కానిమ్ము; అధఃపతనము కానిమ్ము; అధఃపతనమునుండియే అనంత కైవల్య సిద్ధి.

ఊర్వశి : నియమ రహితమైన జీవితము, అసుర ప్రవృత్తికి ఆలవాలము కాదా?

దూర్వాస : అసుర ప్రవృత్తి కానిమ్ము; సుర ప్రవృత్తి కానిమ్ము; సురాసుర ప్రవృత్తి కానిమ్ము; ఏమైన కానిమ్ము; నీ హృదయ మధుర మల్లికా నిభృత నికుంజముల నేను గండుతుమ్మెదనై పాడుకొని తీరవలెను. అందనుక నా వాంఛలు శమింపవు; నేను శాంతింపను.

ఊర్వశి : అయ్యో! ఏమి ఈ ప్రణయ పరితాపము?

దూర్వాస : ప్రణయమో! ప్రళయమో! ఈజీవిత స్రవంతి ప్రణయ సముద్ర సమాగమము చెందు వరకూ శాంతింపదు.

**ఊర్వశి** : మహర్షులు మహ త్తర విజ్ఞాన శిఖరమునుండి.

దూర్వాస : అధఃపతితుడ నగుచుంటినని యూ ! నాకు తెలియును. సర్వమూ నాకు తెలియును. పర్వత శిఖరాగ్రమునుండి కాలు జారిన నేల కూలుటేగాని మధ్యేమార్గమున ఎవ్వరూ నిలువ జాలరనికూడ నాకు తెలియును ఊర్వశీ! నీ వెన్ని చెప్పిననూ నేవిన జాల; నీవు రానిచో నే మనజాల.

ఊర్వశి : ఇదియేమి నిర్బంధము – మహర్షి!

గీ. విరుల చిదిమిన తేనె స్రవింపగలదె?
ఎడద పిండిన ప్రేమ జనింపగలదె?
ప్రకృతి జన్యమౌ ప్రణయ సంబంధమెపుడు
సహజమేకాని – బలవంత సరణియౌనె?

గీ. రెక్కలనుకట్టి, వినువీధి రివ్వుమనుచు,
ఎగురమన్నచో పావుర మెగురగలదె?
గొంతునులిపిన కోకిల కూయగలదె?
స్వేచ్ఛనరికట్ట – ప్రాణి శోభింపగలదె?

మహర్షి ! పొంగి పొరలెడి సెలయేటి కెరటాల పాడుకొనకుండ ఎవరు శాసింప గలరు?

దూర్వాస : (బాధ నంతయూ దిగమింగి) ఎవ్వరూ శాసింపలేరు. నీవు చెప్పునదంతయూ యదార్థమే. కాని ఊర్వశీ! ఏదో మహత్తర తేజో తపఃప్రభావమున కొట్టుకొనిపోవు నా జీవిత నావను ఎవరో ఒక్కసారిగా సుడిగుండముల పాలుజేసిరి... ఊర్వశీ! అంతు పంతులులేని అగాధ మహాసముద్ర మధ్యమున నా ప్రణయ జీవితనావ ప్రయాణము... దానిని ప్రశాంత తీరమే జేర్చెదవో! పర్వతాంచలములు తాక శిధిల మొనర్చెదవో! నీ అభీష్టము. చుక్కాని నీ అధీనము —

ఊర్వశి : ఎవరి జీవిత నావను వారే తీరము చేర్చుకొనవలెగాని, అన్యులపై ఆధారపడ తగునా?

ఉ. లే జవరాలనోయి ! తొలిరేకులు విప్పిన యౌవనమ్ముతో
ప్రూజను సేతునోయి ! వలపున్ జతసేయుచు నృత్య కేళినీ
మోజును తీర్తునోయి ! మధుమూర్తిని; మానస మున్ముకొంచు నీ
తో జతకూడనోయి ! ఎటుతోచిన నీవటు సేయుమో మునీ !

దూర్వాస : ఏమి నీ అహంభావము; నన్నే నిరాకరించెదవా ?

ఊర్వశి : నిరాకరించుటకు రాలేదు మహర్షీ ! ఆజ్ఞాపింపుడు; శిరసా వహించెదను.

దూర్వాస : అయిన — ఏదీ ఒక్క మధురాశ్లిష్టము.

ఊర్వశి : (కోపోద్రిక్తయై) మహర్షీ !

దూర్వాస : (కోపోద్రిక్తుడై) ఊర్వశీ !

ఊర్వశి :

గీ. చిరుత భావాలు ఎడద ప్రూచినది మొదలు
రెక్కలను విప్పి, మింటిపై చుక్కవోలె
ఎగిరి పోతిని — స్వేచ్ఛగా ఎగిరిపోతి —
ఎవరు సంకెళ్ళ నాడు బంధింపలేదు;
ఇపుడు బంధింతురా త్వదభీప్సితమ్ము ...

మహర్షీ !

గీ. చిరుత రెక్కలు నరికిన నరకవచ్చు;
ఎఱ్ఱ నెత్తుటి మరకలు హృదయవీధి —
కాను పించిన — కాంతులు కలతచెంద —
వలపు తీరునో ! హృదయంబు బరువు గనునో !
ఏమి జరుగునో ! సుంత యోజించి కొనుడు !!

మహామునీ ! వీణ తీవలు మీటిన సంగీతము వినగలరుగాని, తీవలు తెంచి, వీణను శిథిల మొనర్చి సంగీతము వినగలరా ?

దూర్వాస : అయిన ఎందులకు వచ్చినట్లు ?

ఊర్వశి : రాగమున రంజించుటకు; నృత్యమున లాలించుటకు.

దూర్వాస : అయిన ఏవీ నీ నృత్యగీతములు.

(ఊర్వశి భయకంపిత యౌను)

(దూర్వాసు దుద్రిక్తుడగును)

(ఆమె భయ విహ్వాలయై పాడును.)

—: విషాద గీతం :—

అనంత కైవల్యమే నా అరచేతి కొసగినా
కన్నీటి కాల్వలో కరగి పోవును రా !
హృదయమే
చిదికి పోవును రా !

*

ఈ వియోగినీ హృదయాన
భగ్నమైనా అగ్నివీణకు
శ్రుతులు చెదరునురా !
తీయని
గతులు మారునురా !

*

ఈ పరిదగ్ధజీవి ఫాల భాగాన
చివురించి, మురిపించు 'తిలకమ్మె'
చెరగి పోవునురా !
కన్నీట
కరగి పోవునురా !

*

ఈ ప్రణయ భిక్షువుపాత్ర శిథిలమైపోవ,
వలపు గంధపు మాధురుల్ చెదరిపోవ,
ప్రణయ గ్రంథపు పుటల్
రుధిర
మొలికించురా ! !

దూర్వాస : అహో ! కోపమునకంది ఎరుపెక్కిన నీ మధురాశ్యము మరింత శోభావహముగా నున్నది ఊర్వశీ ! చిరుచెమటచే కరిగిన కుంకుమ రేఖపై జారిన నీ ముంగురులు – చిరుగాలికే చెదరిపోవు లేమావి చివురువోలె బాధచే కదలి పోవు నీ అధరము – లలితకళా లాశ్యముచే ఎరుపెక్కి కుంకుమ వెలార్చు నీ అరుణారుణ చరణములు నన్ను మరింత వెఱ్ఱివానిని జేయుచున్నవి ఊర్వశీ !

ఊర్వశి : ( కోపము – దుఃఖము – మిళితమైన భావముతో ) అవును. చెరిగిపోవు నా కుంకుమరేఖ; జారిపోవు నా కన్నీరు; మీకు శోభనీయవా ? ఎదుటి వారిని బంధించి బాధించుటలోనే కదా మీకానందము. పూలపై భ్రాంతిచే లతనే త్రుంచివైతురా ?

చ. విదిత యశో విశాలురు; త్రివిష్టప మేలెడువారు; వేదముల్
చదివినవారు; శాస్త్రముల సారమెరింగినవారు; కాని – స్త్రీ
హృదయ నిగూఢ వేదన లెరింగిన వారలుకారు; అయ్యయో !
హృదయముపిండి నెత్తు రొలికించుట నిర్మల ప్రేమ ధర్మమా ! !

దూర్వాస : (ఉద్రిక్తుడై) ఊర్వశీ ! నీ సమాధి నీవే నిర్మించు కొనుచున్నావు సుమా !

ఊర్వశి : (నిర్లక్ష్యముగ) నిర్మించుకొన్న సమాధిపై ఏ భగ్నజీవియో కొన్ని వేడికన్నీటి బిందుల చిందును లెండు; అవియే ఈ పేద జీవికి తిలోదకములు; అమృత తర్పణములు.

దూర్వాస : (కోపోద్రిక్తుడై) ఎంత వేడిననూ నాహృదయార్తి చల్లార్చని పాషాణహృదయినివి; ఏల పాషాణివి కారాదు ? అహ్హహ్హా ! అహ్హహ్హా ! (వికృతముగ నవ్వుచూ) నీ నవ విలాస శిరీష కుసుమ పేశల మనోజ్ఞరూప లావణ్యమంతయూ ఏమైపోవునే పాషాణి ! (కమండలము కృష్ణాజినము ధరించి, పోబోవుచూ ఊర్వశివంక చూచును)

ఊర్వశి : మహర్షి ! పతితనగుటకంటె పాషాణినగుట మేలు. అందు

సుఖదుఃఖము లుండవు. ప్రేమదేవత ఆశీర్వచనమున్న మీా శాపము నాకు దీవనగా ఫలింపకుండునా ?

దూర్వాస : అదియా నీ భావము? ఊర్వశీ! ఎప్పుడూ నీవు పాషాణివై ఉండవు. ఏ నిశాప్రశాంత సమయమున నీ ప్రియుని ప్రణయాశ్లేషమున పరవశమంద ప్రయత్నించెదవో - ఆరాత్రి సమయము ననే-భూలోకమున పాషాణివగుదువు. పగలెల్ల నీరూపసౌందర్యము నీకుండును.

ఊర్వశి : మహర్షి ! మహర్షి !

దూర్వాస : పాషాణివిగమ్ము ! ఇక పొర్లుకొనుచు, పొర్లుకొనుచూ, పెంధూళి దొర్లుకొనుచూ పొమ్ము.

ఊర్వశి : అం హాలోస్మి ! హాతోస్మి !

(వెడలును.)

దూర్వాస : అహో! ఊర్వశీ! ఎట్లయి పోతివి ! నీ పాషాణ హృదయమునకు తగిన రూపమే ఇది - ఏదీ - ఆ తేజో నయనాంచల చంచల చంచరీక విస్ఫురత్ప్రణయ సుధార్ద్ర రేఖామాలికా మరీచీ చలల్లాశ్యము-పోయినది నీ శోభామాధుర్యము. ఊర్వశి-పాషాణి.

(వికటముగ నవ్వుచూ ఉద్రిక్తుడై వెడలిపోవును.)



# ఊర్వశి

## ఐదవరంగం

FRONT STAGE

పాత్రలు : 1. నారదుడు.
2. దూర్వాసుడు.

స్థలం : భూలోకం — గీతానందుని ఆశ్రమప్రాంతం.

సమయం : ప్రాతఃకాలం.

సందర్భం : దూర్వాస పరాభవం - నారదుని హేళన.

(నారద ప్రవేశము)

—: గీతం :—

నారద : మాధవ గోపసఖా ! యదురాజ !
నీదగు మహిమ ! ఏరికి తెలియు ॥మాధవ॥
కృపజూపుమురా ! గోపకిశోర !
మధురమోహన ! దేవా ! రావో ! ॥మాధవ॥
సుధలూరెడు నీ మోమునుజూపి
భవమహాఘము - బాపరావో ॥ మాధవ॥

సీ. కొండ కోనలనుండి కోటిరేవులు దాటి
సెలయేరు జలధిలో కలియుచేల !
కొమ్మ కొమ్మలనుండి కోటిరెమ్మలదాటి
కోకిలల్ హాయిగా కూయుటేల !
గాలి రెక్కలపైన తేలిపోవుచు మింట
చిరుత మబ్బుల జంట చేరుటేల !
లేత వెన్నెల యెద కోత కోసెడువేళ
కలువతా వలపూర కులుకుటేల !

విరుల క్రొందేనె తుమ్మెదల్ వేడుకేల!
తరుల లతకూన పెనవైచు మురిపమేల!
ప్రణయ ముద్రాంకితంబౌ ప్రకృతినెవడు
గాంచి – కన్నీరునించి – ప్రేమించకుండు?

భగ్నజీవి – వ్యధాకులితచిత్తుడు – అడిగో దూర్వాసుడు.

దూర్వాస : నారదా! వందనములు.

నారద : మహర్షీ! వందనములు. నందనారామమునుండి కాబోలు తమ రాక?

దూర్వాస : అవును.

నారద : అహో! ఆ నందన మందార తరుచ్ఛాయలలో – ఊర్వశీ ప్రణయినీ పరీరంభణమున పరవశమంది...

దూర్వాస : వచ్చుటలేదో త్రిలోక సంచారీ! వచ్చుటలేదు.

నారద : మరి?

దూర్వాస : వారల అహంకార మణచి వచ్చుచుంటిని.

నారద : ఓహో! మేనకా! రంభా! తిలోత్తమా!...

దూర్వాస : (చిరునవ్వుతో) ఆ ముదుసలులకు అహంకారము కూడనా?

నారద : అట్లయిన మిమ్ముల్లను నిరాకరించిన దెవరు?

దూర్వాస : ఉన్నది కదూ! ఊర్వశి – వయోప్రౌఢిమచే కావరము కన్నులకు తట్ట – నావంటి మహర్షినే నిరాకరించి అనుభవించు చున్నది.

నారద : ఏమనుభవించు చున్నది?

దూర్వాస : పాషాణరూపము.

నారద : (ఆశ్చర్యముతో) అదేమి మహర్షీ! ప్రణయమూర్తి ఊర్వశి పాషాణి యగుటేమి?

దూర్వాస : చేసుకొన్నంత మహాదేవ! గర్వమునకు ఫలితమనుభవింప వలదా?

నారద : నారాయణ ! ఇంతకూ తమ శతక్రతువు విధ్వంస మైనట్లే కదా !
దూర్వాస : అయిన కానిమ్ము.
నారద : ఇక శతక్రతువు పూర్తిచేయరా !
దూర్వాస : ఎన్నటికీ చేయను. సామాన్య ప్రేమోపాసనకే స్వర్గాధిపత్యము లభ్యమైన ఈ శతక్రతు వాచరించు కేల ?
నారద : ఆ ప్రేమోపాసన మీకు దుర్లభము గనుక.
దూర్వాస : దుర్లభమా ! ఎన్నటికీ కాదు. ఆ కర్మానుష్ఠానమున కైనను, ఈ ప్రేమానుష్ఠానమున కైనను నన్నుమించి మఱొకడుండగలడా ?
నారద : ఏమో ! విక్రమసార్వభౌముడు మూర్తీభవించిన ప్రేమ స్వరూపుడని విందుమే... !!
దూర్వాస : ఆ ప్రేమోపాసకుడు - ఈ ఊర్వశీ పాషాణమూర్తి నారాధింపనిమ్ము. తెలియు నాతని ప్రేమమహాత్మ్య తత్త్వము.
నారద : తప్పక తెలియును. కాలగభీర గర్భమున ఏ మహత్తర ప్రణయ పరిణామదశ వినీలమై యున్నదో !
దూర్వాస : చూచెదనుగాక ! పిపీలికనుండి పిండము వరకూ ప్రేమోద్ఘాటనే ... ఇక నీవా ప్రేమతత్త్వమును బోధింపుము.
నారద : అంతకంటె ఆనందమేమి ?

సీ. గుండె బద్దలుచేసి కోటివిత్తులునాట
మధురసస్యము లిచ్చు మాతృభూమి;
తనగుండె నెత్తురంతయు చనుబాలగా
మార్చి, బిడ్డలకిచ్చు మాతృదేవి;
తనకు లేకున్నను తన బిడ్డలందరి
కర్పించి రక్షించు కన్నతండ్రి;
పర్వతచర్యల పచ్చిక మేయుచు
తీయని పాలిచ్చు ధేనుమూర్తి;

అణువణువునను తాండవంబాడునట్టి
ప్రేమమహిమంబు తెల్పిరి సృష్టికెపుడో!
స్వార్థరహితమ్ము; నిర్మల శాంతియుతము
ప్రణయతత్వంబు నెరుగనివారు గలరె?

దూర్వాస : ఓహో! ఏమి ప్రేమతత్వము. మీరందరీ నూతన ప్రేమ తత్వమును త్రిలోకముల ప్రబోధింపుడు ... నేనా విక్రమోర్వ సుల తత్వము పరీక్షించెదనుగాక!— (వెడలును)

నారద : నారాయణ! పాప మీ వెఱ్ఱిబాగులతపసి ప్రణయమూర్తి ఊర్వశిని పాషాణిగా శపించి, తనతపోశక్తిని కొంత గోల్పోయి నాడు. ఇక శతక్రతువును చేయనూ లేడు. ఇంద్రత్వము పొందనూ లేదు ఆహా! ఈశ్వరేచ్ఛ అనుల్లంఘనీయము కదా!

గీతం

శ్యామసుందర ప్రభో! హేదేవ!
సృష్టిఅంత నీ భక్తకోటి కాదా?
శాంతి జీవితంబే విధాననే గడుపువాడ
నీప్రేమ లేకయే ॥శ్యామ॥

(పాడుకొనుచూ వెడలును)



# ఊర్వశి

## ఆ ఱ వ ర ం గ ం



## BACK STAGE

పాత్రలు : 1. ఊర్వశి
2. గీతానంద మహర్షి
3. విక్రముడు

స్థలం : గీదానందుని ఆశ్రమము

సమయం : ప్రభాతం

సందర్భం : విక్రమోర్వశుల ప్రణయ కథాకలాప ప్రారంభం.

(ప్రభాత కిరణప్రసరణచే పాషాణిగానున్న ప్రణయిని ఊర్వశి నిజస్వరూపమున నృత్య మొనర్చుట – గీతానందుడు ప్రభాత గీతము పాడుట)

—: ప్రభాతగీతం :—

శుభోదయమ్
నవజీవన
శుభోదయమ్!
అరుణారుణ కిరణ వికసిత నవజీవనమ్!
అమలకావ్య గంగాతరంగిణీ తరళలాశ్యమ్!
నవజీవన
శుభోదయమ్!!
పద్మినీ హృదయ సహస్రదళ వికసిత నవోదయమ్!!
పద్మజాండ కలుషాపహరణ మధుభావనమ్
నవజీవన
శుభోదయమ్!!

*   *   *

(విక్రమప్రవేశం)

(విక్రముడు : మహారాజు, రసజ్ఞుడు, ప్రేమోపాసకుడు అతి ప్రశాంతంగా ఉన్న ఆశ్రమప్రాంగణం లోనికి ఆయన ప్రవేశించడం - ఊర్వశి తబ్బిబ్బు పడడం జరుగుతుంది)

విక్రమ : ఎవర్నీవ్ ?

ఊర్వశి : (నిర్లక్ష్యంగా) ఎవరినా? ఎవరినో కనబడుటలేదూ ?

విక్రమ : స్త్రీవే - కాదనికాదు. కాని ఎవర్నీవ్ ?

ఊర్వశి : తిరిగి అదే ప్రశ్నా ? నే నెవరినైన మీకెందుకు ?

విక్రమ : అవసరమున్నది కాబట్టి.

ఊర్వశి : (ఆశ్చర్యంతో) అవసరం! ! మాతో ... మీకు... అవసరమేమిటి ?

విక్రమ : చాలా ఉన్నది. నీ వెవరివో చెప్పమని నా ఆజ్ఞ.

ఊర్వశి : (ఆక్షేపణతో) ఆజ్ఞ ! ! (చిరునవ్వునవ్వి) మాపై మీ ఆజ్ఞ ఏమిటి ? మీ ఆజ్ఞ కెన్నడూ బద్ధులముకాము; కాలేదు; కారాదు.

విక్రమ : (ఆగ్రహముతో) - ఎందుచేత ?

ఊర్వశి : (అతినిర్లక్ష్యముగ) మీరు మగవారు గనుక.

విక్రమ : (విసుగుదలతో - కనుబొమలు చిట్లించి) అయిన ?

ఊర్వశి : మగవారితో - ఒంటరిగా ఉన్న మగవారితో - నిండు యౌవనములో ఉన్న మగవారితో - అందును భోగలాలసులగు మగవారితో - ఆడవారు మాటాడరాదని మా గురువాజ్ఞ.

విక్రమ : మీ గురువెవరు ?

ఊర్వశి : (వయ్యారంగా తిప్పుకుంటూ) ఎవరా ? ఎవరంటే - చాలా గొప్పవారు.

విక్రమ : (విసుగుదలతో) ఉహూఁ... నీ దేవూరు ?

ఊర్వశి : (కేళీ విలాసముతో) ఏవూరని చెప్పను ? ఈ విశాల ప్రపంచమంతా నా నాట్యశాలే.

విక్రమ : (చిరునవ్వునవ్వి) ఓహో ! అయిన నీవు దేవదాసివా ?

ఊర్వశి : (దాసి అనగానే పూర్వస్మృతులు జ్ఞాపకంవచ్చి అతి కోపంతో) దాసీ ! దాసి... మీరో పెద్దమహారాజుల్లా...

విక్రమ : ఏమిటీ అధిక ప్రసంగము ?

ఊర్వశి : ఎందుకీ అనవసర ప్రసంగము ?

విక్రమ : రాజ్యములో విషయములు రాజునకే అనవసరమా ?

ఊర్వశి : (ఎద్దేవనగా) రాజ్యం !!! మీకో రాజ్యము కూడా...

విక్రమ : ఆర్యావర్త మహాసామ్రాజ్యమే తెలియదూ ? ఆ సామ్రాజ్య రమా ధౌరంధర్యమంతయూ నా భుజస్కంధముపైననే భరియించు చుంటినని యెరుగవా ?

ఊర్వశి : (అతి ఆక్షేపణగా) మీదో రాజ్యం, మీరొక రాజులూను, వెఱ్ఱిరాజా ! మీ రాజ్యమూ, మా రాజ్యమూ, అన్ని రాజ్యములూ ఆ పరమాత్ముని రాజ్యములో పరమాణువులని ఎరుగరూ ?

విక్రమ : (మరింత ఆక్షేపణగా) చిత్తం.

ఊర్వశి : ఆ పరమాణువును బ్రహ్మాండముగా మాట్లాడుట మీకు అనవసరము కాదూ ?

విక్రమ : ఏమిటీ మితి మీరి మాట్లాడుట ?

ఊర్వశి : మితిమీరిన శ్రుతి తప్పును;
శ్రుతితప్పిన గతి తప్పును;
గతితప్పిన మతి తప్పును;
మతి తప్పిన... ...

విక్రమ : (అతికోపమున) మాట్లాడకుము. (ఆశ్రమము వైపు వెళ్ళి) మహర్షి ! (బిగ్గరగా పిలుచును.)

ఊర్వశి : (అతనికంటె ముందుపకు వెళ్ళి) మహర్షి ! (మరింత ఎలుగెత్తి పిలుచును. లోపలనుండి గీతానందస్వామి "ఆ_ఆ_" అని జవాబిచ్చును.)

విక్రమ : గీతానందస్వామీ ! ఆశ్రమములో ఆడవారా !

ఊర్వశి : గీతానందస్వామీ ! ఆశ్రమములో మహారాజులా ! !
(గీతానందుడు ఆశ్రమమునుండి బయటకు వచ్చును.)

విక్రమ : మహర్షి ! ఈమె ఎవరు ?

ఊర్వశి : మహర్షి ! ఈయ నెవరు ?

గీతానంద : (ఊర్వశివంక జూచి) చక్రవర్తి ఊర్వశీ !

ఊర్వశి : (ఆశ్చర్యముతో) చక్రవర్తా ! ! !

గీతానంద : వీరు 'విక్రమ' నామధేయులు; "ధర్మ' మూర్తులు.

ఊర్వశి : "విక్రమం" - "ధర్మం" ఏలాఉన్నా
'నామం' - 'రూపం' బాగున్నవి.

విక్రమ : మహర్షి ! ఈమె పరదేశివలె నున్నదే ? ఆశ్రమోచిత సత్కారము, సముచిత ప్రవర్తనము తెలిసినట్లు లేదే ?

గీతానంద : అవునవును. అనుభవముతక్కువ (ఊర్వశివంకజూచి) ఊర్వశీ ! నిరంతర యజనయాగాదిక్రతూత్సవ దీక్షాదక్షులకు కల్ప తరువు; ప్రేమమయుడు; అభివాద మొనర్చితివా ?

ఊర్వశి : స్వామీ ! సార్వభౌముల యెడ సానుభూతి నాకు లేదు. వారికి హృదయము లుండవు. వారి హృదయాంతరముల నవశుభ వసంతము కాలుమోపదు. మూగవోయిన వారి జీవితముల ప్రేమాయింప ప్రకృతికూడ నిష్ఫలమగును.

విక్రమ : స్వామీ ! ఈమెకు రాజోచిత సత్కారము లే తెలియవను కొంటిని. ఆశ్రమనిబంధనలైన పాటించునట్లు లేదే ! తపోధనుల తపోవిధ్వంసమునకు కారణము స్త్రీ లేకదా ? అట్టి స్త్రీలకా ఆశ్రమమున తావిచ్చుట ! యోజింపుడు స్వామీ ! యోజింపుడు ! !

ఊర్వశి : కృపాణపాణులైన మహారాజుల ఆగమనము, అహింసా ధర్మముల కాలవాలమగు ఆశ్రమశాంతి విధ్వంస కారణము కాదా?

యోజింపుడు స్వామీ! యోజింపుడు! అమాయిక ప్రజాహృదయములుపిండి, మామిడిచివురులువోలె ఎఱ్ఱనైన వారినెత్తుటి పొంగులో రంగులు చిత్రించుకొన్న, వీరి రత్నమయ కిరీటమునకా నమస్కరించుట ?

పతితబాధాపరిదగ్ధ బానిస జీవచ్ఛవాల యెముకలు డొలచి, నిర్మించిన మణిమయసింహాసనమునకా జోహారు లర్పించుట ?

పరదేశాక్రమణ నిబద్ధబుద్ధిచే దండెత్తి, బ్రతుకుబరువులు మోయలేక, కృంగి కృశించుసైనికుల హృదయములు చీల్చి చెండాడి, వారినెత్తుటిమంటలో కాల్చి పసునుపెట్టుకొను వీరికృపాణములకా భయపడి తలలువంచుట... యోజింపుడు స్వామీ! యోజింపుడు!

గీతానంద : (అతిప్రశాంతముగ) ఊర్వశీ! ప్రజాపరిపీడనమున ప్రమత్తులగు రాజులు లేక పోలేదు. కాని.. మన విక్రమునట్లు భావింపరాదు. ప్రజలకైతాను బలియగుటేగాని – తనకై ప్రజలను బలిసేయని ధర్మైకమూర్తి! ఈ విక్రమ చక్రవర్తి!

ఊర్వశి : అట్లయినవారికి నా వందన సహస్రములు...

గీతానంద : సార్వభౌమా!! స్త్రీ ప్రణయంకరి! ప్రళయంకరి – అందుననే జగన్నిర్మాణమునకు, నిర్మూలనమునకు కారణమైనది. కాదనను. తపోభంగమునకు, రాజ్యాంతఃకలహములకు కారణము కాంచనములతోపాటు కాంతయూనగును. కాని – అట్టికాంత మన ఊర్వశి మాత్రమెన్నడూ కానేరదు.

విక్రమ : స్వామీ! ఆమెహృదయమర్థముగాక అన్యథా భావించినందుకు మన్నింపుడు.

గీతానంద : సార్వభౌమా!! ఎదటిహృదయము నర్థముచేసికొనుటకన్న సృష్టిలో కష్టమొకటిలేదు.

ఉ. మానవ మానసమ్ము గనుమానిసికట్టెను ఏ యుగంబునన్ ?
దాని గభీరనిశ్చలత, దాని నిరంకుశ రాజమార్గముల్ –
దాని నిజానిజమ్ములును – దాని వినూతన చిత్రగాధలున్,
దానిని సృష్టిచేసిన విధాత యెరుంగ డదేమి చిత్రమో ! !

విక్రమ : నిజము. లేకున్న ప్రేమ మూర్తియగు ఊర్వశిని అన్యధా భావింతునా ?

గీతానంద : ఇప్పటికైన ఒకరినొకరర్థము చేసికొనిరి. అంతియేచాలు. ప్రేమమూర్తుల మధుర స్నేహము సృష్టికే నూతన తేజము. వారి అనురాగమే ప్రకృతికి అలంకారము. ఊర్వశీ ! విక్రమునకికనుండి స్వాగతమిచ్చు భారము నీదేసుమా !

ఊర్వశి : నేనిచ్చుటేమి ? ప్రణయమూర్తికి ఈ ప్రకృతియే వేయి వేల హస్తములస్వాగతమిచ్చును. శుకపికములానందగీతములాలపించును.

గీతానంద : (విక్రమునివంకజూచి) చూచితివా ఆమె ప్రేమోపాసన ?

విక్రమ : చూచుటేకాదు; రసతన్మయత చెందుచున్నాను.

గీతానంద : అదే పురాకృత సుకృతము. మీ మధుర స్నేహము శుభావాప్తియగు గాక !

గీ. స్వార్థ రహితమౌ ప్రేమకు జగములెల్ల
తలలువంచి, పూజించి, నృత్యమ్ము సేయు;
ప్రేమ జగదభిదేవత; ప్రేమకెపుడు
దేవ దేవుడేకాని అధీనుడగును.

ఊర్వశీ ! సార్వభౌమునకు...... సపర్యలు.

ఊర్వశి : తమ అనుగ్రహము.

గీతానంద : శుభమస్తు...... (వెడలును)

(ఊర్వశి విక్రమునకు సర్వవిధ సపర్యలొనర్చి పాడుతూ – ఆడుతూ – పూలహారం వేస్తుంది.)

— భావ గీతం —

ఊర్వశి : నాలోనే నందన వనం
నవ్వుల పువ్వులు విమ్మే వేళ –
నాలోనే ప్రేమ తరంగం
ఊహాంచలముల ఉబికేవేళ –
ఈ పూలనె నే
పూజిస్తా !
ఈ సృష్టినె నే
పాలిస్తా ! !
* * *

విక్రమ : నాదేవి పదములు మోపేచోట
ఈ దీనుని లోయెద పరచినబాట,
నాదేవి కనుగవ త్రిప్పినచోట
ఈ దీనుని బ్రతుకే తిరిగెడిబాట
పున్నమి రేలే
పొంగి పొర్లగా !
కిన్నెర లన్నీ
కలసి పాడగా !
* * *

ఊర్వశి : నా యెదలో వలపుల వీణలు
తమంతతామే రాగముతీస్తే,
ఈ కదలే కమ్మని తావులు
పూలవీవనల నాట్యముచేస్తే
ప్రేమీ ప్రేమికు
లొకటై పోరా !
ప్రేమ సీమల
నేలు కోరా ! !
* * *

విక్రమ : ఈ బ్రతుకులె తీయని కలలైపోతే !
మన ఆశలె మాయని వలలైపోతే !
అడుగు అడుగునా వియోగవేదన వినిపిస్తే,
ఎడద బరువులే కడలి నురుగులై వేధిస్తే,

అజాండ మంతా
ఏకము చేద్దాం,
అణువు అణువునా
ప్రణయమె పోద్దాం !!
* * *

విక్రమ : (పరవశుడై) ఊర్వశీ ! మృదులములై, నవశిరీష పేశల సదృశములై, ఉషోరేఖా భాసురములైన నీ పాణిపల్లవములు నా సపర్యలచే ఎంతగాకంది ఎరుపెక్కి పోయినవో !

ఊర్వశి : (అర్ధనిమీలిత నేత్రయై) మహాశయా !! ప్రణయమూర్తులకు సేయు సపర్యలకన్న మిన్నయగు ఆనంద మేమున్నది ?
వలపు తెరచిన పూవుటెదలో
కులుకు పుప్పొడి పసిడి బె తళుకు—

ఈ జగద్వలయ వేలా ప్రణయశాలలో, మన ఆత్మీయ జీవన్మాధుర్య సౌందర్య కళావిలాసముల కలిసి, కరిగించి, మరిగించి, పొంగించి, పొర్లించుచున్నవి.

విక్రమ : సత్యమే ఊర్వశీ ! నీ క్రీగంట వర్షించు వీక్షణ సుధారేఖా మాలికలు ఈ విశ్వసుందర శోభకే అమృత భిక్షనొసగుచున్నవి. అహో ! నీ నవయౌవన సౌందర్య విలాసము, ఈ నా జీవితమును క్షణ క్షణము అమృతరస స్నపితము చేయుచున్నవి. ప్రేయసీ !
ఏ స్వర్లోక విమల సీమాంతములకో—.
ఏ రహో మధుర వేలాశాలలకో—
ఏ దూరదూర రహస్థిరములకో—
ఎచ్చటకో ! ఎట్టులో ! నన్ను తీసుకొని పోవుచున్నవి. అవధి

ఎరుగని నా జీవనరథ ప్రయాణములో అమృతవృష్టి కురిపింప నేతెంచిన ఏ అమరాంగనవో!!

ఊర్వశి : ఎవరినో! ఎవరినో! !నన్ను నేనే మరచిపోతిని. ఇది ఏదో... ఒక మధురస్వప్న సమాగమము.

విక్రమ : ప్రేయసీ!

ఊర్వశి : ప్రియతమా!!

విక్రమ : ఊర్వశీ! అదేమి చిత్రమో కాని—

గీ. వలపు కోకిల ఒకసారి పాడినంత
ప్రకృతి మధురస భరితమై వరలనేల?
ప్రేమదేవత చిరునవ్వు వినినయంత
హృదయ రసతంత్రులన్నియు కదలనేల?

ఊర్వశీ! ఈ జగన్నాటకమున ప్రణయరంగ మెంత రస వద్భరితము.

గీ. లేత కోర్కెలు లోలోన కోతకోయ
ఏలనాయెద నీకై తపించుచుండె?
ప్రేమ తెరచిన హృదయాన వేనవేలు
అమృత గీతాల నెవరోకో ఆలపింత్రు?

ఊర్వశి : ఎవరా? ప్రణయ దేవతలు.

విక్రమ : అట్లయిన... ఊర్వశీ! ... కాదు; ప్రేయసీ! అనురాగ సరసిలో అలలమై కలసిపోరాదా?

ఊర్వశి : హృదయము లోకమైననాడు....

విక్రమ : కాకపోవుటేమి?

ఊర్వసి : అట్లయిన...

గీ. కలికి పూలన్ని తీయని కలలు కనగ,
ప్రణయ కోకిలనై నేను పాడుకొందు;
శ్రుతిని జతచేసి – నిరుపమ గతులచూప,
ప్రేమవీణియ మీటుడు ప్రియము మీర!!

విక్రమ : అంతకంటె ఆనంద మేమున్నది? ఊర్వశీ! "ప్రేమ" ఆరాధించునది కాని అర్థించునదికాదు. ప్రేయసీ!

గీ. వలపు తెరచాపలెత్తిన వాలుగనుల
విశ్వసౌందర్యరమకు నైవేద్య మిడుమ!
పెదవి చివురాకు వెనుడాగు పిన్ననవ్వు,
అమృత హృదయాలకిమ్ము సౌహార్ద్రభిక్ష.

ఊర్వశి : ఏమి కళోత్సాహము! ... మాటమాటకు ... నా మనోనటన్మార్గుల్తై, నా ఆత్మవేదికపై అనంతప్రేమజ్యోతులు వెలిగించినారు...

విక్రమ : అందుచే నా మనసే బంగారపు పళ్ళెరమున ప్రతిష్ఠించి నీకు అర్పించుచున్నాను.

ఊర్వశి : (హేళనగానవ్వుచూ) వలదు. వలదు. రాజుగారి మనోభారము భరించుటకు రాణీలు పెక్కుమంది.

విక్రమ : (ఆలోచించుచూ) పెక్కురు లేరే!

ఊర్వశి : ఇక్కడ కాదు; అంతఃపురమున.

విక్రమ : అంతఃపురమునే; ఉన్నది ఒక్కరేకదూ ?

ఊర్వశి : (క్రిందిపెదవి కొఱకి – ఓరకంట చూచుచు) ఉన్నారూ !

విక్రమ : లేకేం ? ఆమెను గాంచిన ఆశ్చర్యపోదువు. ఎప్పుడూ పూజా పునస్కారములే; పురాణ శ్రవణములే; తీర్థయాత్రలే; దేవళ నిర్మాణములే ...

ఊర్వశి : వయోవృద్ధుల కుండవలసిన భక్తి ఆమె కెందులకు ?

విక్రమ : ఆమె వృద్ధురాలు కాకపోవుటేమి ?

ఊర్వశి : (ఆశ్చర్యంతో) ఎవరండీ ఆమె ! !

విక్రమ : ఇంకెవరు ? మా అమ్మగారు.

ఊర్వశి : (విరగబడినవ్వి) అమ్మగారా !

విక్రమ : అమ్మనిన నవ్వెందుకు?

ఊర్వశి : అ హాఁ - అర్ధాంగి అనుకొంటిని లెండి.
విక్రమ : పెళ్ళికానిదే అర్ధాంగి ఏమిటి ?
ఊర్వశి : కాలేదూ !
విక్రమ : మీ అమ్మగారు చేయనిదే ?
ఊర్వశి : పెళ్ళిచేయుదురా ? చేసికొనెదరా ?
విక్రమ : పూర్వముచేసెడివారు; ఇకనుండి చేసికొందురు.
ఊర్వశి : పెళ్ళికి ప్రధానము పెద్దల నిర్ణయమా ? ప్రేమా ?
విక్రమ : ప్రేమే !
ఊర్వశి : (విలాసముతో) మరి - ఆ ప్రేమకు ముహూర్తము ఇంకనూ.
విక్రమ : కుదరకేమి ? కుదురుచూ, కుదురచూ ఉన్నది.
ఊర్వశి : (ఆశ్చర్యంతో) ఎక్కడ ?
విక్రమ : ఇక్కడే!
ఊర్వశి : ఎవరితో ?
విక్రమ : నా హృదయమునే ప్రశ్నింపుము.
ఊర్వశి : హృదయ మున్నకదా ?
విక్రమ : లేకేమైనది?
ఊర్వశి : నా అధీన మైనది.
విక్రమ : అట్లులా ?
ఊర్వశి : అట్లే.
విక్రమ : ఊర్వశీ! ప్రాతస్సంధ్య ఎఱ్ఱపడుచున్నది. ఇక పోయివత్తునా?
ఊర్వశి : (విక్రముని చేయి పట్టుకొని ప్రకృతిని చూపుచూ) వెళ్ళ వచ్చును లెండు... ఇచ్చటి ఈ మల్లికామధురనికుంజములు, ఇచ్చటి ఈ లవలీలతావితానము, ఇచ్చటి ఈ మాలతీ లతాంత పరివృత ప్రాంతము, ఇవన్నియూ మీ రాజ్యాంతఃపురమున కనిపించునా ?
విక్రమ : నవవసంతమంతయు నీనయనాంచలమునసే దాచుకొంటివి.

ఇక అంతఃపురమున ప్రమోదములు కాక మొగ్గలెట్లుండును? ఇక పోయివత్తునా? (అని ఖడ్గము మరచి వెళ్ళ బోవును)

ఊర్వశి : పునర్దర్శన భాగ్యము.

విక్రమ : తప్పక.

ఊర్వశి : (విక్రముడు మరచిన ఖడ్గమును తీసి కన్నుల కద్దుకొని) అహో! మా విక్రమ సార్వభౌముని వీర ఖడ్గమా?

ఉ. భారత మాతృదేశ విభవంబును చాటెడు ఖడ్గరాజమా!
భారత వీరనారి అరివర్గముపై దుముకంగ - పోరిలో
వీరుల కుత్తుకల్ దునిమి వెచ్చటి నెత్తుటి జల్లు వెల్లువై
ధారలు కట్టి ఏరులయి తాండవ మాడగ జేసినావుపో!

విక్రమ : (తిరిగి ప్రవేశించి ఆత్రుతతో) అహో! ఊర్వశీ! నన్ను నేనే మరచి పోతిననుకొంటిని. నా ఖడ్గమునుకూడ మరచిపోతినే.

ఊర్వశి : అవునవును. భారతదేశ వైభవముచాటెడు ఖడ్గరాజ మిదిగో!

విక్రమ : (స్వీకరించి) మంచిది. (గైకొని) సెలవు.
(అని పాదరక్షలు వదలి వెళ్ళును)

ఊర్వశి : (పాదరక్షలను గైకొని) ప్రభూ! పాదరక్షలు.

విక్రమ : అయ్యయ్యో! నీవు ముట్టవలదు ఊర్వశీ! అది సేవక ధర్మము.

ఊర్వశి : నేను సేవకురాలను కాదా!

విక్రమ : ఎన్నటికీకాదు? నా మనోనటన్మూర్తివి, నా హృదయమేక రాణివి.

ఊర్వశి : అవును. హృదయానికిరాణిని; పాదాలకు దాసిని; అన్నీ నేనే.

విక్రమ : (భుజముపైతట్టి) ఏమి అనిర్వాచనీయ అనురాగము.

ఊర్వశి : నా యనురాగమనిర్వచనీయమా? అవును. అనిర్వాచనీయమే!

— మ ధు ర గీ తం —

నా హృదయ మందార దళములన్ని పరచినారా!
నడచిరారా! వలచి వలపించుకో వరమునీరా!

కోకిలాంగన మనకొరకె
పాడుచుండెనురా!
మదమిళిందము మనకొరకె
ఆడుచుండెను రా! రారా! ||నా హృదయ||

అమృత వీణియమీటి
అమరగానముసేయ,
ఆనంద సీమలో
ఐక్యమై పోదాము - రారా ||నా హృదయ||

నాకీలు జడలోన
నలిగిపోవనిపూలు
కలలు కంటున్నాయి
అలుక సైపగజాల! రారా! ||నా హృదయ||

(ఊర్వశీ విక్రమలు వెడలిపోయెదరు.)



# ఊ ర్వ శి

## ఏ డ వ రం గం



(FRONT STAGE)

పాత్రలు : 1. మాయాదేవి
2. విక్రముడు
3. మంత్రి.

స్థలం : విక్రముని అంతఃపురం - మాయాదేవి పూజా మందిరం.

సమయం : సాయంసమయం.

సందర్భం : ఊర్వశీ కళావిలాసములకు ముగ్ధుడై విక్రముడు ప్రవేశించును. తల్లి ఆశ్చర్యపోవుట, మంత్రి వారించుట.

(పూజామందిరమున మాయాదేవి తంబుర మీటుకుంటూ పాడుకొనుచుండును)

**విక్రమ :** (పాటఅయినతరి విక్రముడు ప్రవేశించి తల్లి ఇచ్చిన హారతి కన్నుల కద్దుకుంటాడు)

**మాయా :** నాయనా! ఇంత ఆలశ్యమా! చూచీచూచీ కన్నులు కాయలుకాచిపోయినవి. వేయికన్నులతో వేయిమార్గాలు వెదకినాను. కనబడలేదు. నిస్పృహా, నిరుత్సాహం ఏలనాయనా!

**విక్రమ :** నిన్ననే వచ్చెడివాడను. కాని—మధ్యేమార్గమున మహర్షులున్న వారి దీవనలు పొందమనికదా! నీ ఆజ్ఞ

**మాయా :** అవునవును. మహాత్ములదర్శనం విముక్తిసాధనం; పాప విధ్వంసనం.

విక్రమ : అందుననే మహర్షి గీతానందునిదర్శించి, వారి దీవనలుబడసి వచ్చుచుంటిని.

మాయా : అయిన ఈ పూలహారమెక్కడిది ? పెద్దలుపిన్నలకు వేయ రాదే !

విక్రమ : ఆయన వేయలేదమ్మా ! ఆయన ఆశ్రమవాసినిచే వేయించి నారు.

మాయా : ఆశ్రమవాసినా ?

విక్రమ : ఆఁ ఆఁ ఆశ్రమవాసినే.

మాయా : ఆశ్రమములో ఆడవారా !

విక్రమ : ఆమె సామాన్య మానవకాంత కాదమ్మా ! ముక్తికాంత.

మాయా : ముక్తికాంతా ? ఎవరు చెప్పారు ?

విక్రమ : గీతానందు లే. ఆమెపేరు 'ఊర్వశి' అట.

మాయా : ఊర్వశీ ! (ఆశ్చర్యముతో)

విక్రమ : ఎందులకమ్మా ఆశ్చర్యము ? ఆమె ఎంతసౌందర్యవతి అనుకున్నావ్ ! త్రైలోక్య సౌందర్యమంతయూ రూపుదాల్చి అవతరించిన నిరుపమాన ముగ్ధమోహన శృంగార తేజో స్వరూపిణి !

మాయా : సౌందర్యమా !

విక్రమ : ఒక్కసౌందర్యమే కాదమ్మా ! ప్రత్యణువూ పులకింప, గాలి రెక్కలపైన రసాధి దేవతను మిన్నులు ముట్టింప, అమర నృత్యము సేయగల అసమాన కళారాధిని.

మాయా : నృత్యము కూడనా ! ! !

విక్రమ : నృత్యమే కాదమ్మా ! మొగ్గలురాల్చిన మోడులు సహితము, ద్రవించి, ప్రసవించి, రాగము తీయునటుల పాడగలదు. వేయేల ! తన విమల గాంధర్వగానముచే విశ్వమునే పరవశము చేయగల ప్రజ్ఞాధురీణ.

మాయా : చాలునాయనా ! ఇకచాలు. ఊర్వశీ, రంభా, మేనకా,

తిలోత్తమా, ఇవన్నీ సాధారణముగా వేశ్యలే పెట్టుకుంటారు. ఆమె తప్పక వేశ్యయే !

విక్రమ : వేశ్యకాదమ్మా ! దేవదాసి !

మాయా : వేశ్యఅన్నను.. దేవదాసి అన్నను ఒకటే నాయనా ! వేశ్యలను కన్నెత్తి చూడరాదు; పన్నెత్తి పలుకరాదు; ఒక్క అడుగు కలిసివేయురాదు; కామాంధులకు వారి ఆలయములు దేవాలయములు.

విక్రమ : అమ్మా ! ఆమెను చూచిన నీ విట్లనవు. ఆమె దేలోకమో ! ఏకులమో ! తెలియదుకాని - ఆమెతో మాటాడిన వారెవ్వరునూ ఆమెను మరువలేరు; ఆమెను విడిచి మనలేరు.

మాయా : రామ రామ. మారిపోయావ్. పూర్తిగా మారి పోయావ్. మాయదారి వారవనితలవద్ద మందు మాకు లుండు నని ఆర్యోక్తి. ఆమె ఏమందు మాకులూ పెట్టి మనసు మార్చ లేదు కదా ? (మంత్రోదకములు చల్లును...)

విక్రమ : అమ్మా ! నీవు భావించినట్లు నీచస్త్రీయే అయిన, ఆశ్రమ ప్రాంగణమునకు మహర్షులేల రానిచ్చిరి ?

మాయ : మహర్షులకు నీచము, ఉచ్చమూ లేదు. వారు ద్వంద్వా తీతులు. క్రూరమృగములు సహితమచ్చట సాధు మృగములుగా చరించును. కాల సర్పములు సహితమచ్చట పూల మాలలగును. ఆ నెలవుదాటిన వాని నిజస్థితి వానికి వచ్చునుబాబూ !

విక్రమ : నీవు చెప్పునది నిజమే. కాదనను. కాని "ప్రమాణమంతః కరణ ప్రవృత్తయః" అను నార్యోక్తి ననుసరించి, ఆమె దుష్టురాలైన నా హృదయ మామెయెడ యెట్లాకృష్టమగును.

మాయ : నాయనా ! ప్రతిప్రబోధము ఆత్మప్రబోధమని తోపించు నట్లు చేయునదే మనసు. మనసు కల్పించే మాయ, మనసు నిర్మించే వల, మనసు ఏర్పరచే కల - మానీంద్రులకు సహితము మచ్చ కల్పించును. మనోనిగ్రహమే మానవాభ్యుదయమునకు మార్గగామి.

విక్ర : అమ్మా ! ఇది నా ఆత్మీయ ప్రబోధమే. మనో ప్రబోధము కాదు. ఆమె ఆత్మీయ జీవనబాంధవి; అనురాగ నిధానము; ఆర్ద్ర భావ సంభవ కమనీయమూర్తి !

మాయా : అయ్యయ్యో ! ఇవి ఏమి మాటలు నాయనా ! ఆమె ఏమైనా పిశాచము కాదుకదా !

విక్రమ : కాదమ్మా !

మాయా : పిశాచము కాకపోతే పెనుభూతమా ?

విక్రమ : అబ్బబ్బా ! ఏ పెనుభూతము కాదమ్మా !

మాయా : కాకపోవుటేమి ? ఆ మెరుపెక్కిన కన్నులు, ఆకందిన ముఖము – ఆ కంపించు పెదవులు – తెలియుట లేదూ – ఏదో భూతమావహించినట్లు–(అటు ఇటు చూచి) ఎవర్రా అక్కడ ? పిలవ్రా ఏ మాంత్రికుణ్ణో ! ఏ తాంత్రికుణ్ణో !

విక్రమ : ఏమిటమ్మా ! ఈ రాద్ధాంత సిద్ధాంతము. చెప్పెడి మాటలు వినవే !

మాయా : ఇంకేమి వినను? నిక్షేపము వంటిబిడ్డవు. నిలువునిలువునా పాడైపోయావు. (పూజామందిరం వద్దకు వెళ్ళి) హేప్రభూ ! ఈ సామ్రాజ్యమంతయూ మూపున ధరించిన సార్వభౌముడే. రక్షింపవా ! తండ్రీ! రాజక్షేమమే ప్రజాక్షేమముకాదా ! (భగవానునివద్ద విభూతి తీసుకొనివచ్చి కుమారునకు పెట్టి) ఇంక శాంతించును లెమ్ము, నాయనా ! శాంతించును లెమ్ము. (భగవానుని చూచి) ఓ కృపామయా ! యావద్రాజ్యభారము నీ అధీనమని ఆరాధించితినే – దాని కిదాఫలితము ?

విక్రమ : అవును. ఇదే ఫలితము. ఈ విశ్వ విశ్వంభరా తలమున ఎప్పుడే ప్రాణి ఏది అర్థించి, ఆరాధించునో, దానినే సఫలీకృతము సేయుటకై కంకణము దాల్చిన కరుణామయుడే ఆ భగవానుడు. భక్తుల సంకల్పములు సిద్ధించుట సత్యమే. ఆ సంకల్పములు ఏనాడు, ఏపవిత్ర ముహూర్తమున, ఏవిధమున సిద్ధించునో మన మూహింపలేము.

మాయా : భగవానుని హృదయా విష్కరణ మెంతచక్కగాచేసితివి నాయనా! ఇంత ఉద్రేకముగా ఎన్నడూ మాటాడలేదే! నేడీ విధి మాటాడుటకు కారణము? ఇదంతయూ ఏదో ఇంద్రజాలము వలె నున్నదే!

విక్రమ : భగవల్లీలలే ఇంద్రజాలములు; అందిది విధికృతము; దైవ ప్రసాదితము; మహర్షి ఆశీః ప్రభావము; జననాంతర సౌహార్ద్ర సంజనితము; నా అదృష్టము.

మాయా : ఏమోనాయనా! కొంతసేపు విశ్రాంతి తీసికొనుము. నేనును విశ్రాంతి తీసికొందును.

విక్రమ : అటులనే, నీవు వెళ్లిరమ్ము.

మాయా : (వెడలును.)

(విక్రముడు విచారముతో అటూ ఇటూ తిరుగుచూ ఉంటాడు)

సేవకుడు : (ప్రవేశించి) సార్వభౌమా! దర్బారునకు రావలయునని మంత్రిగారు కబురు చేసినారు.

విక్రమ : కారణాంతరముల సార్వభౌములు నేడు దర్బారునకు రాజాలరు. అమాత్యులనే ఇట రమ్మనుము.

సేవక : దేవర అనుగ్రహము. (వెడలును)

విక్రమ : ... ... ... ... ...

సేవక : (తిరిగి ప్రవేశించి) అమాత్యులేతెంచినారు.

విక్రమ : లోనికి రమ్మనుము.

సేవక : చిత్తము. (వెడలును)

మంత్రి : (ప్రవేశించి) సార్వభౌమా! వందనము. ఏమి ఇంత ఆలస్యముగ విచ్చేసితిరి?

విక్రమ : ఆలస్యమా! ఎంతయో త్వరితముగా వచ్చితిననుకొంటినే! న్యాయమునకు కొంత ఆలస్యముగ రావలసి యుండును.

మంత్రి : ఎందుచేత?

విక్రమ : ప్రకృతి ప్రణయహస్తాల నన్ను మిన్నులు ముట్టించుట చేత... ఆమాత్యశేఖరా!! నవజీవన వసంతమాధుర్య వాహినుల విడిచి పుంస్కోకిల రాగలదా ?

మంత్రి : అట్లు ఏ రసవదనంత వాహినీ ప్రవాహమున కొట్టుకొని పోయినారో !

విక్రమ : ప్రేమ వాహినిలో

మంత్రి : అదేమి సార్వభౌమా ? మీరాక ఎచ్చటనుండి ?

విక్రమ : మహర్షి గీతానందుని ఆశ్రమమునుండి.

మంత్రి : అట్లయిన... ఈ పుష్పమాల ఎవరలంకరించిరి.

విక్రమ : ఆశ్రమవాసిని.

మంత్రి : (త్రుళ్లిపడి) ఆశ్రమవాసినా ?

విక్రమ : (అతివిశ్చలముగా) అవును. ఆశ్రమవాసిని – ఊర్వశి.

మంత్రి : ఊర్వశా ! ఏదేశమునుండి వచ్చినది ?

విక్రమ : అదే తెలియదు కానీ – విశ్వమంతయూ ఆమె నాట్యశాలయట.

మంత్రి : ఏమీ ! దేవదాసియా ప్రభూ !

విక్రమ : అవును. ఎంత కళాభిలాషణ! ఎంత ప్రేమోపాసన! ఎంత చక్కని సత్కారము! మరతుమన్న మరపురానిదా మగువమంజు దరహాసము.

మంత్రి : సార్వభౌమా ! వారకాంతా సత్కారము ప్రభువులు స్వీకరింపరాదు.

విక్రమ : ఎందుచేత ! వారకాంతలు మానవులుకారా ! వారికి హృదయములు లేవా ?

మంత్రి : ఉన్నవి. కల్మషపూరితములై.

విక్రమ : వారకాంతలైనంతమాత్రమున హృదయములు కల్మషపూరితములై యుండునా ?

మంత్రి : తప్పక. కులము - కుటుంబము - హృదయపరిణామమునకు గీటురాళ్ళు.

విక్రమ : పొరపాటు. హృదయపరిణామమును నిర్ణయించునది కులము కాదు; గుణము. కులములు మానవ కల్పితములే; భగవల్లిఖితములు కావు. జీవితాభ్యుదయమునకు మూలము సత్ప్రవర్తనము; ఆత్మజ్ఞానమే.

మంత్రి : నాకుమాత్రము నమ్మకము లేదు సార్వభౌమా!! త్రాగుబోతును, జూదరిని, వారకాంతను నమ్మి నాశనము కానివారు లేరు.

విక్రమ : నమ్మినాశనమైనవారు లేరు. మనప్రేమకు లోతులు లేకున్న ఎదుటి హృదయమును కొలువలేము. మన భావమే ఎదుటి హృదయదర్పణమున ప్రతిబింబించును. మనప్రేమ నిర్మలమైన సృష్టిఅంతయూ నిర్మలముగా గానబడును. ప్రేమ జయించని దీ సృష్టిలో లేదు. ప్రేమించి కాలసర్పము సహితము పూలహార మగును.

మంత్రి : సార్వభౌమా! మీ భావములు లోకాతీతములు.

విక్రమ : నాభావములేకాదు. ఊర్వశీ భావములు అంతియే. అమాత్య శేఖరా! ఊర్వశి సామాన్య మానవకాంత కాదు. కేవలము రాగ రససామ్రాజ్య రాజ్ఞీమతల్లి. అందుననే ఆశ్రమమున పవిత్రస్థానము తనంత తా పొందగల్గినది. ఆమె జీవిత మనన్య సాదృశము.

మంత్రి : ఆమెరూపరేఖా విలాసాదులు, కళావిలాసము, వినుచున్న కొలది నాహృదయమెందుకో అశాంతికి ఆలవాలమగుచున్నది. ఆమె మధురకళా జీవిని కానిండు; కాకపోనిండు; పరకాంతా ప్రసంగము రాజోచితము కాదు. ప్రజాపరిపాలనా విధానమే భావనీయము; అన్యము కాదు.

విక్రమ : అందుచే.

మంత్రి : రేపు వేకువననే మగధదేశ ప్రయాణము. సంసిద్ధులు కావలయునని ప్రార్థన.

విక్రమ : రేపా... వేకువనా... ప్రయాణమా... రాలేను. నాహృదయాంతర మశాంతి తమోగర్భచ్ఛిదాదక్షము. శాంతికై విశ్రాంతి అవసరము.

మంత్రి : చిత్తము. ఈ పత్రములనైన పరికింపుడు. మహాప్రభూ! ప్రజాక్షేమమునకై ఆ మగనాలిని మరచుట మంచిది.

విక్రమ : అధిక ప్రసంగమనవసరము. ఆమెను మరచుట కసాధ్యము. ఇక మీరు వెళ్ళవచ్చును.

మంత్రి : ప్రజాక్షేమము మరచి... ఊర్వశీ...

విక్రమ : చాలు. నా కర్తవ్యమునాకు తెలియును.

మంత్రి : సెలవు.

విక్రమ : మంచిది.

మంత్రి : (వెడలును).

(విక్రముడు నిష్క్రమించును)



# ఊ ర్వ శి

## ఎ ని మి ద వ రం గ ం



## BACK STAGE

పాత్రలు : 1 ఊర్వశి
2. విక్రముడు

స్థలం : గీతానందుని ఆశ్రమం

సమయం : ప్రాతఃకాలం

సందర్భం : ఊర్వశీ విక్రముల ప్రణయోల్లాసం

—♦ ఊర్వశీ ప్రణయ గీతం ♦—

రావో
శశిమాతా !
నా ప్రియుని గొని తేవో !
నా ప్రేమ మధుగొనిరావో ! ॥రావో శశిమాత॥

మధుర నికుంజాలలో
ఎదురుచూచు నా కైపోవో ॥రావో శశిమాత॥

పిలువ లేక నా కనులు రాల్చెడు
మేలి ముత్యములనే నిడలేనో !
లేవుగా !
హాయిగా !
ఈ నవమృదు చంద్రికా
లేలనో !
ప్రబుకేలనో ! ... ॥రావో శశిమాతా॥

విక్రమ : (ఊర్వశి వెనుకకే వచ్చి) అహో! ప్రణయినీ! పట్టపగలే చంద్ర సందేశములా?

ఊర్వశి : (నివ్వెరపోయి) పగలా! పట్టపగలా! మరచాను. మబ్బు మాటునున్న సూర్యుని చూచి చంద్రుడని భ్రమించాను. అబ్బా! బ్రతుకే భ్రమ అయిపోయింది. వలపే కల అయిపోయింది.

విక్రమ : ఏమి ఈ నిర్వేదన! ఏమి ఈ నిస్పృహ!

ఊర్వశి : ఏదో దూర దూర తీరాల వెలిగే వెలుగులే నా జీవన రథాన్ని నడిపిస్తూ ఉన్నాయ్.

విక్రమ : అలాగే...

ఊర్వశి : అలాగే ... రండీ. హృదయ ద్వారములు తెరచుకొని స్వాగత మిచ్చుచున్నాను. రండి. ప్రణయసింహాసనము అధివసించండి.

విక్రమ : దేవిగారి ఆజ్ఞ.

ఊర్వశి : దేవరవారు పాలించెదరా?

విక్రమ : అంతకంటె ఆనందమున్నది?

ఊర్వశి : నిజం!

విక్రమ : సంశయమెందులకు?

ఊర్వశి : అతిస్నేహ మెప్పుడూ భావిని శంకించుచునే యుండును కెందు ... అందుచేత ...

విక్రమ : సంశయమా! ఊర్వశీ!! క్షణక్షణమూ నా హృదయాంచలములపై వెలుగు సౌందర్య స్వర్గసీమా మసృణారుణ మనోజ్ఞ కాంతిరేఖవు నీవు ... నాభావనా శకుంత పక్ష్మలాంచలములపై ముసుగులు తీసుకొని గుబాళించు ప్రణయవాసంత పరీమళము నీవు. నీవే నా హృదయమును గ్రహింపకున్న ...

ఊర్వశి : ఆఁహాఁ గ్రహింపక కాదు. మీనోట ఈ మాటలు విని శృంగార కావ్యములో మధురాధ్యాయములు చిత్రించుకొనుటకు... ...

విక్రమ : అట్లంటివా ?

ఊర్వశి : అంతియే... కాకున్న...

గీ. ప్రకృతి వీణనే శ్రుతిసేయు రసికవరుడు
ముగ్ధమోహన సౌందర్య మూర్తి అయిన
కలికి హృదయమ్ము శ్రుతిసేయ కష్టపడునె ?
వలచి వలపించుకొనకుండ వ్యర్థుడగునె ?

విక్రమ : ఏమిటీరసోల్లాసము ?

ఊర్వశి : రసోల్లాసమా? కాదు. కలలో కలవరింపు; వలపులో పలవరింపు – ప్రియతమా ! మీ ప్రేమ నర్థించుటకు నాకు అర్హత కలదా ?

విక్రమ : ఎందుకు లేదు ?

ఊర్వశి : నేనొక సామాన్యకాంతను; అందునూ ఒకపరిదగ్ధజీవిని – మీరో... మహారాజులు... మిమ్ము ప్రేమించుటకు... ...

విక్రమ : అధికారము లేకేమి ? ఊర్వశీ ! ప్రేమలో తరతమ భావము లుండునా ?

గీ. సృష్టి అంతయు భగవాను చిత్రశాల;
అందు గడ్డిపోచకునైన హక్కుగలదు;
ప్రేమదేవత దాని పాలించుచుండు;
వారు వీరను భేద మావంత లేదు.

అదియునుగాక—

గీ. అఖిల మంతయు భగవాను నాలయంబె;
'ప్రకృతి' అందు ప్రధాన విగ్రహము సుమ్ము;
దాని నర్చింప పూజారి దక్షిణేల ?
కోర్కెలీడేర ఎవరైన కొలువవచ్చు.

ఊర్వశి : అట్లయిన మీహృదయము నాఅధీనమేకదా ! నానిధానమే కదా ! !

ఉ. చేయికి చేయిజేర్చి వికసించిన గొజ్జగి పూలదార్లలో
పోయెడువేళ – మీ యెడదపొంగు రహోమధురార్ద్రవల్లికల్
పూయగనిండు భావసుమముల్; కనుపింపని తీయవేదనల్
వ్రాయగనిండు మీహృదయ గ్రంథమునన్ ప్రణయాను గీతముల్.

విక్రమ : అట్లే ! ప్రేమసీ ! ! యథార్ద్రమునకు నీ పవిత్ర పాదారుణ చ్ఛాయలలోనే ఈ ప్రణయజీవికి ఆనంద మందిరము; అనంత కైవల్యము; ఆశారసధునీ తరంగ మృదంగ లాశ్యము...

ఊర్వశి : ప్రభూ ! ఏమి ఈ సౌందర్యోపాసన !

విక్రమ : ప్రతి పూవునూ పలికించి పాడించు సౌందర్యము; ప్రతి లతనూ నవ్వించి నాట్యముచేయించు సౌందర్యము; నీ పాదములను, నీతనువును పూజించు కొనుచున్నవి ఊర్వశీ ! ఏమి నీ సౌందర్యప్రాభవము ! ఏమి నీ కళా జీవనము !

ఊర్వశి : ప్రభూ ! ఏమిరసానుభూతి ! ఇది అంతయూ స్వప్నమా ? లేక జాగ్రదావస్థా? స్వప్నమే అయిన దీర్ఘస్వప్నము కానిండు... ఈ వేకువ వచ్చిన స్వప్నము

విక్రమ : ఏమేమి ?

ఊర్వశి :

చ. అలసటతీర ప్రేమ మధురాసవ పాత్రిక మోవికీయ – నా
అలకలు దిద్ది – కౌగిలిడి – అంకము జేరిచి – మేలమాడుచున్
వలపుల మల్లెతేనెలను వారగ పోసిన స్వప్నమిప్పుడున్
కలచుచునుండె నాయెగ – సుఖంబన ప్రాణికి ఎంత వాంఛయో!!

విక్రమ : అహో! ఎంత తీయని స్వప్నము ! ఊర్వశీ! ఏమధుర క్షణమున నీ మహనీయ సౌందర్యచ్ఛాయలు నా హృదయ ఫలకమున శృంగార రేఖలు చిత్రించుకొన్నవో – ఆ క్షణముననే– ఆ మధురక్షణముననే – నా హృదయ రసవాహిని మిన్నులు ముట్టినది. ఊర్వశీ! నేను విక్రముడ నేకాను; కేవల ఊర్వశీ ప్రేయసీ ప్రేమోపాసకుడను ఊర్వశీ!

— భా వ గీ తం —

ఏ శరన్మల్లికా మంజరీనటన్
మధుకరీ మధూక్తి;
ఏ వసంత రసాల కిసలయాస్వాద నియుక్తి
కోకిలాంగన ఛలోక్తి;
ఏ హిమవత్పర్వత ప్రసవన్మధురఝరీ
ఝుళన్ ఝుళత్పదానురక్తి;
నీ మాటలో – పాటలో – ఆటలో –
వెల్లివిరిసెను దేవి! పొంగి పొర్లెను దేవి!

ఏ పురాకృత మధువు
చివురించె నీ పెదవి,
ఏ పురాకృత ప్రేమ
వికసించె నీ యెదలో,
నెచ్చెలీ!
నెచ్చెలీ!
నీ కంట నారూపు
నా కంట నీరూపు
జ్యోతులై
చుక్కలై

కౌగిలింతల కలసి
కరగి పోయెను దేవి!

కోటిపడగల స్వామి
కోటి వీణలు మీటి
మనకొరకె
మనకొరకె
పాట పాడుచునుండె;

కోటి నమల్లికలు
జంట జంటలుచేరి
మనకొరకె
మనకొరకె
ఆటలాడుచు నుండె
నెచ్చెలీ!
నెచ్చెలీ!
జీవితో త్తేజ చలన్మ
రీచికా డోలికల
ఊగి పోరాదె
నెచ్చెలీ
మింటిపై
కేగి పోరాదె!

* * *

చ. చిలికిన మల్లి కామధువె జీవన వాటిక పొంగి - పొర్లె - నిన్
తలచు క్షణమ్మె కన్గొనల దాగుడు మూతలనాడు బొమ్మముల్;
వలపున ఇంతతీపి కలదా! వలదా! మధురా ధరమ్మె; వె
న్నెల బయలన్ - నికుంజముల నీడల మేనులు వాల్పదోసమా!

ఊర్వశి : దోసమేమున్నది? ప్రేమిా ప్రేమికలు రసాస్వాదన పరు
లగుటలో దోసమేమున్నది?

విక్రమ : లేదు. ముమ్మాటికి దోసము లేదు ... ఊర్వశీ !

గీ. నీదు చెక్కిట చేయిడి నిమురునాడు,
నీదు కన్నుల వెన్నెల నిలచునాడు,
త్రిజగతీరమ సౌందర్య తేజమెల్ల
పాల చిరునవ్వు పొంగులో ప్రతిఫలించు.

ఊర్వశి : అందుచే

గీ. నవ్యవాసంత సురభిళానంద మధుర
నందనారామ పుష్పనిష్యంద సుధలు,
పికకుమారుల మృదుల గీతికలయందు
అలలు పొంగింప స్నానాలు సలుపరాదె !

విక్రమ : తప్పక – రా – ఊర్వశీ – రా ! మన అంతఃపురమునకే పోదము. రా !...

ఊర్వశి : గీతానందస్వామికి ఎరుకపరచ వలదా ?

విక్రమ : వార్త పంపుదము లెమ్ము.

ఊర్వశి : నాడునికి అంతః పురమున అశాంతికి కారణమగునేమో !

విక్రమ : ఏమైనకానిమ్ము ... నిన్నువీడి ఒక్కక్షణమైన మనలేను ... రా !... రా !...

ఊర్వశి : అట్లే ... పోదము ...

## ఊర్వశీ మధుర నృత్యగీతం

రావోయి !
ప్రియా !
రావోయి !

వసంత కోకిల కూసినదోయీ !
వలపు తేనెలను పోసినదోయీ !
ఈవనమే బృందావన మోయి !
నేనె నీ ఊర్వశీ రాణి నోయి ! ॥రావోయి॥

ప్రతి పూవు నందన మందారమోయి !
ప్రతి పులుగు రవమూ ప్రణవ నాదమ్మోయి !॥రావోయి॥

నాకంటి పాపలో నగ్న సత్యము నీవె;
నాతోంటి జన్మలో మధురజీవనమీవె;
నీవు లేకున్న నేనె లేనోయి !
నీవు రాకున్న నిలువలేనోయి ! ॥రావోయి॥

* * *



# ఊర్వశి

## తొమ్మిదవ రంగం



FRONT STAGE

పాత్రలు : 1. నారదుడు
2. దూర్వాసుడు
స్థలం : దూర్వాస ఆశ్రమ ప్రాంతం
సమయం : ప్రాతఃకాలం
సందర్భం : ఊర్వశీ విక్రముల గాఢానురాగం నారదుడు దుర్వాసునకు తెలియజేయుట

(నారదుడు ఊర్వశీ విక్రముల గీతానుగుణంగా వారు విడిచి పెట్టిన స్థాయినె అందుకొని పాడుకొంటూ ప్రవేశిస్తాడు.)

నారద :

—♦ గీతం ♦—

మాధవదేవా ! కరుణాలోల !
రాధాహృదయ విహారా !

మధురావాస !
మమ జీవనదాత !
పాలిత జగతి రమణా ! ॥మా॥

మురళీలోల !
మోహనబాల !
కావుము గోపకుమారా ! ॥మా॥

దూర్వాస : (ప్రవేశించి) ఓహో! త్రిలోకసంచారులా!

నారద : చిత్తము.

దూర్వాస : కలహభోక్తలగు నారద మునీంద్రులా!!

నారద : విష్టపత్రయమేలనున్న దూర్వాస మహర్షులా!!

దూర్వాస : చిత్తము.

నారద : వందనము.

దూర్వాస : వందనము.

నారద : మహర్షి!

దూర్వాస : నారదా! మీ ఊర్వశీ పాషాణి హృదయమేమైన ప్రేమాంబువుల చివురించెనా?

నారద : చివురించుటేకాదు; పుష్పించెను.

దూర్వాస : పుష్పించెనా?

నారద : పుష్పించుటేకాదు; తనహృదయదళములను విప్పుకొని మిళిందసార్వభౌమునకు స్వాగతమిచ్చినది.

దూర్వాస : సార్వభౌముడు రసాస్వాదనలో పడెనా?

నారద : పడుటేకాదు; మత్తిల్లి మైమరచినాడు.

దూర్వాస : సృష్టినికూడ మరచెనా?

నారద : మరచుచూ మరచుచూ ఉన్నాడు. ఇపుడతనికొకే ఉపాసన.

దూర్వాస : ఏమది?

నారద : ఊర్వశీ ప్రేయసీ ప్రేమోపాసన - ఇపుడతని ఆరాధన - భగవదారాధనకాదు; ప్రేమారాధన - ఇప్పుడతని ధ్యానము భగవద్ధ్యానముకాదు; ఊర్వశీధ్యానమే.

దూర్వాస : మాటలాడని పాషాణితో మన్మథశృంగారము లేమి లయ్యా మహాశయుని!

నారద : అదే మనకర్థముకానిది; వారికర్థమైనది. మహర్షీ ! మనలను మనమే ప్రేమింపలేకున్న ఈసృష్టిని ఇంకేమి ప్రేమింపగలము ? అంధునకైనను ఆశలుతీర్చి, అమృతత్వమొసగు అనురాగము అర్థమగుట అసంభవము తమకు.

దూర్వాస : సామాన్యుడైన విక్రమునకు లభ్యమైనది నాకలభ్యమా ! అహ్హాహ... చూతముగాక ! నాటకమున కొన్నిమధుర సంఘటన లున్నంతమాత్రమున నాటకము సుఖాంతమగునా ?

నారద : భగవత్కృప ! మనలో ఏమున్నది ?

దూర్వాస : ఏమున్నదో ముందు తెలియగలదు. భగవత్ కృపఅట... భగవత్కృప... సృష్టికి ప్రతిసృష్టిచేయగలనాకు భగవానుడన్న భయమా ! ఊర్వశీపాషాణి ప్రేమించిన నన్నే ప్రేమింపవలెను. లేదేని అణువు అణువుగామార్చి, పెంధూళిలో దిశాంచలములకు ఎగర కొట్టెదనుగాక !

నారద : ఏమీ ! ప్రేమను బల్మిమై అనుభవింతురా ! !

దూర్వాస : ఆఁ అనుభవించెదను...

నారద : (ఆక్షేపణతో) బల్మిమై !

దూర్వాస : ఆఁ.

నారద :

ఉ. ప్రేమ నిరంకుశత్వమున పెంపొనరించునె ? ఎవ్వరేన్
ప్రేమను బల్మిమై అనుభవించిరె ? ప్రేమకు స్వార్థమున్నదే ?
కామమె కాలసర్పమయి కాటును వైవ ప్రశాంతి పోవదా ?
స్వామి ! విషాదవేదనల భావతరంగము లింకిపోవవే !

దూర్వాస : ముంజేతి కంకణమునకు అద్దమెందులకు? ఊర్వశీ ప్రణయ హృదయము వ్యథలు చిందునో ! సుధలు చిందునో తెలియనుగాక!

నారద : చిత్తము. ఒకసారి తెలిసినది. మరొకసారికూడ తెలియగలదు.

## —♦ గీతం ♦—

జగతియే మోహన ధామమురా!
హరినామ స్మరణ జపమాలా!
ఘోర కలుషహర రారా! దేవా!
శాంతికరా! వరదా! ప్రభో! కావరా!

ప్రజాంగ నానుత!
వాసవ సేవిత!
శ్యామల రూపా!
రావేలా! ॥జగతి॥

దేవా! కృపగనవా!
మధురిపు శీలా!
మనోజ్ఞ బాలా!
రారా! నిరంజన! ॥జగతి॥



# ఊర్వశి

## పదియవ రంగం



BACK STAGE

పాత్రలు : 1. విక్రముడు
2. ఊర్వశి
3. మహారాణి
4. మంత్రి

స్థలం : రాజాంతఃపురం

సమయం : ఉదయం

సందర్భం : ఊర్వశిని అంతఃపురమున ప్రవేశపరచుట.

(ఊర్వశీ విక్రములు చేయీ చేయీ కలిపించుకొని ప్రణయ సంతప్తులగుచూ, పాడుకుంటూ, వస్తారు.)

—: ప్రణయగీతం :—

విక్రమ : రావో!
రావో!
జీవన బాంధవి
రావో!

ఊర్వశి : రావో!
రావో!
జీవన బాంధవ
రావో!

విక్రమ : అదేదో ఒక తీయని కల—

ఊర్వశి : అదేదో ఒక మాయని వల—

విక్రమ : కలలోనె ఒకరేఖ
వలపయ్యె;

ఊర్వశి : కలలోనె ఒకరేఖ
బరువయ్యె;

విక్రమ : ఆవలపు బరువులనింక
సడలింప రావో!

ఊర్వశి : ఆవలపు రేఖలు నెపడ
ముగ్గైన లేవో! ॥రావో॥

విక్రమ : ఏ శుభోత్సవ సమయాన
ఇరువురము
కలిసితిమొ— ...

ఊర్వశి : ఏ మధుర వాసంతలాశ్యాన
ఎడదలు
కలిసితిమొ— ...

విక్రమ : ఏ నందనానంద మందార సుమమాల
దీవించెనో!

ఊర్వశి : ఏ మసృణ మనోజ్ఞ మాలతీ మాధురుల్
లాలించెనో!
అపుడె ... ...

విక్రమ : రాగరస రాజ్యాన సఖులమై పోయాము;

ఊర్వశి : భావకవితాసీమ కవులమై పోయాము;

ఇరువురు : రావో!
రావో!
ప్రేమ వనీ విహారము సేయ!
రావో! రావో!

* * *

(అది విక్రమునిఅంతఃపురము. ఊర్వశి భయపడుతూ ఉంటుంది. ఆమె ఆశ్చర్య భయానకములకు విక్రముడు హాసిస్తూ ఉంటాడు.)

విక్రమ : రా! ఊర్వశీ! రా!!

ఊర్వశి : ఇది... ఇది... (తబ్బిబ్బు పడుతూ).

విక్రమ : ఇదే మన మందిరము.

ఊర్వశి : ఇదంతా ఏదో కొత్తగా ఉన్నదే!

విక్రమ : కొత్తదంతయూ వింతగానే ఉండును. వికసించే ప్రతిపూవూ కొత్తపాటనే తుమ్మెదకు వినిపించును.

ఊర్వశి : కాదనుటకు అర్హత ఎక్కడిది? మీరు రాజులూ...

విక్రమ : తమరో!

ఊర్వశి : రాణీని!...

విక్రమ : అన్నట్లు మా రాణీగారికి నీరాక నెరిగించవలెను.

ఊర్వశి : రాణీ ఎవరు ?

విక్రమ : ఉలుకుపడకు; మా అమ్మగారు.

ఊర్వశి : అమ్మయ్య! అంతఃపురమున అడుగడుగునకు భయమే...

(అంతలో విక్రముడు "అమ్మా! అమ్మా!!" అని కేక వేస్తాడు. మాయాదేవి "ఏం నాయనా"! అంటూవస్తుంది)

విక్రమ : అమ్మా! ఇదిగో ఈ అమ్మాయే ఆశ్రమవాసిని...

మాయ : ఊర్వశా!

విక్రమ : అవును. ఆశ్రమమున అతిథి సత్కారముతోనే అనురాగము పండించుకొన్న అమల కళాజీవి.

మాయ : ప్రపంచమంతానా "నాట్యశాల" అన్నా ప్రజ్ఞాశాలిని.

విక్రమ : ఈ అమ్మాయే... మనజీవితారామానికి నవవసంతము.

(ఊర్వశి వెర్రిగా చూస్తూ కూర్చుంటుంది; లేవమని విక్రముడు సంజ్ఞ చేస్తాడు. ఆమె భయపడుతూ – తడబడుతూ లేస్తుంది)

విక్రమ : ఈమె మా అమ్మగారు.

ఊర్వశి : ఓహో ! అమ్మగారా ! బాగున్నారు.

విక్రమ : నమస్కరించు ఊర్వశీ !

ఊర్వశి : నమస్కరించాలా ? అయితే అమ్మగారూ ! నమస్కారం.

మాయ : కళ్యాణమస్తు.

విక్రమ : అబ్బా ! నీకు అమ్మగారు కాదు.

ఊర్వశి : మఱి?

విక్రమ : అత్తగారు.

ఊర్వశి : మొత్తానికి వరస కలిపి వేశారు.

విక్రమ : ఇం కెంత కాలము.

మాయ : ఊర్వశీ ! లోపలకు రా ! తల్లీ ! లోపలకు రా !! ఇదంతా నీదే ! నీ మందిర మే !... సార్వభౌముడే నీ వాడు.

ఊర్వశి : మీా ఆశీర్వాదం అమోఘం.

మాయ : నేటినుండి ఇదంతా నీదిగానే భావించు. అదిగో ! ఆవేచి యున్న దాసదాసీజనం అంతా నీ అధీన మే. ఈ చిలుక – ఆ గోరు వంక ... ఈ పావురం – ఆ నెమలి – ఆ ముద్దు లేడి – ఊర్వశీ ! సర్వమూ నీ అధీన మే.

(విక్రమునిచూచి) బాబూ ! పూజాసంభారములు తీసుకువస్తా. జాగ్రత. ఆశ్రమ సత్కారం ఆమెది; అంతఃపుర సత్కారం నీది; మరచిపోకు.

విక్రమ : అలాగే !

మాయ : ఉచితరీతిని సత్కరిస్తూ ఉండు. వెళ్లివస్తాను (వెడలును)

ఊర్వశి : అమ్మయ్య ! వెళ్లిపోయూరా !

విక్రమ : ఏం ! ఎందు కానిట్టూర్పు ?

ఊర్వశి : అబ్బా ! ఇది అంతఃపుర మేనా ?

క్రమ : కాక___

ఊర్వశి : ఇనప ఊచల పంజరమేమో! ఇందులో రాణి ఒక పక్షి. రెక్కలన్నీ ముక్కలైపోతే, భావలే బాకులై హృదయం చీల్చి వేస్తాయేమో! చూడండీ! రెక్కా రెక్కా కీలించి, ముక్కూ ముక్కూ జతజేర్చి, చుక్కలవోలె మిన్నంటి ఎగిరే ఆ పావురాయిలూ—యతిప్రాసలకు బద్ధంగాని అడవి పాటలు పాడుకొంటూ ఎంత ఆనందముగా ఎగిరి పోతున్నాయో!! ఆ ఆనందం మనకు లభిస్తుందంటారా ఈ రాణి వాసంలో!

విక్రమ : ఆనందము భౌతికసంబంధికాదు; ఆత్మ సంబంధి. ఆత్మావలోకన మలవడిన కొలదీ ఆనందాన్ని అనుభవించగలము... అయినా! ఊర్వశీ!! నీవు రాణివి.

ఊర్వశి : మీ హృదయమునకా? సింహాసనమునకా?

విక్రమ : హృదయసింహాసనమునకు... ఊర్వశీ! పెద్దలరుదెంచినపుడు లేవాలి; నమస్కరించాలి. ఏ పురోహితులో... ఏ అధ్యాపకులో, ఏ అమాత్యులో...

ఊర్వశి : వచ్చినప్పుడు లేచి నమస్కరించవలెను; తదుపరి...

విక్రమ : ఇలా మేలి ముసుగు సవరించవలయును.

(చేసి చూపును.)

ఊర్వశి : తదుపరి పాదములంటవలెను; పాదధూళి శిరమున ధరింపవలయును; అబ్బబ్బా! అడుగడుగునకూ ఆత్మీయ స్వాతంత్రమునకు సంకెళ్ళేనా? ఎన్ని బంధనములు? ఎన్ని నిర్బంధనములు? రాణి అయి రాచరికము చేయుటకన్న రాయిఅయి మూగవేదన అనుభవించుట మేలు.

విక్రమ : ఎన్నటికీకాదు.

ఊర్వశి : కాదేమిటి! కనబడుతూ ఉంటే—

విక్రమ : ఊర్వశీ!

(లోపలనుండి "మహారాజా!" అని మంత్రి పిలుస్తాడు. ఊర్వశి ఉలుక్కుపడి ప్రక్కకు తప్పుకొంటుంది.)

విక్రమ : ఎవరది ? అమాత్యశేఖరులా !!

మంత్రి : అవును ప్రభూ !

విక్రమ : రండి, దయచేయండి.

మంత్రి : సార్వభౌములకు అభివాదనము.

విక్రమ : మంచిది... అమాత్యశేఖరా !... వార్తలేమి ?

మంత్రి : పడమటి తీరమున సామంతులు పన్నులు గిట్టుట మానిరి. సామాన్య ప్రజలను, వాగుపెట్టు బాధలు వర్ణనాతీతము. దరిద్రుల నెత్తురోడ్చి ధనికవర్గము భూస్వాములగుచున్నారు.

విక్రమ : ఏమేమీ ! విక్రముని పాలనమున అక్రమములా !

మంత్రి : ప్రజాపరిపీడనమునకు అంతులేదు. అక్రమమునకు హద్దు లేదు. ఇట్టి తఱి ప్రజా సంరక్షణమే...

విక్రమ : ప్రభుధర్మము.

మంత్రి : అందున సామంత దండనాయకు లందరూ తమ ప్రయాణమునకు ఎదురు చూచుచున్నారు.

విక్రమ : అవశ్యమిప్పుడే వచ్చెదను. సారధిక...

మంత్రి : కబురు చేసితిని.

విక్రమ : మంచిది... మీరు ప్రయాణమునకు సంసిద్ధులు కండు.

మంత్రి : ప్రభువాజ్ఞ. సెలవు. (వెడలబోవును.)

ఊర్వశి : (ఊర్వశి అతిగారాబముతో విక్రమునివద్దకు వచ్చి) ప్రభూ ! ప్రయాణమా !!

విక్రమ : అవును. ఇప్పుడే ప్రయాణము.

ఊర్వశి : ఎచ్చటకో !

విక్రమ : ఎచ్చట క్షామదేవత ప్రజాహృదయములపై ప్రళయ తాండవము చేయుచున్నదో ! అచ్చటకు !

ఊర్వశి : మీ ఈరాణి, కాదు దాసి – రావచ్చునా ?

విక్రమ : ఎందుకు రాగాదు ?

మంత్రి : (అతి తీవ్రగతిని) అర్ధాంగి కాదు గనుక ... మహారాజా ! మీకు సహచరించుటకు, మీతో సంచరించుటకు మీ అర్ధాంగికి వినా అన్యులకు అర్హత లేదు. ఇది ప్రజలు సహింపలేరు. మంత్రి సామంత దండనాయకులు భరింపలేరు. ఇది కేవల మనుచితము. ప్రజాసంరక్షణ కవరోధము. అధఃపతనమున కాలవాలము.

విక్రమ : మంచిది. నేనే వచ్చుచుంటిని ... ప్రయాణ సన్నాహమునకు సిద్ధముకండు.

మంత్రి : సెలవు. (నమస్కరించి వెడలిపోవును.)

ఊర్వశి : (కోపమున కనులెరుపెక్క) అర్ధాంగికి వినా అన్యులకు అర్హత లేదు. అవును. అర్హత లేదు. అందును ఒక దాసికి; దేవదాసికి ... ...

విక్రమ : ఊర్వశీ !

ఊర్వశి : రాజ్యమును శాసించునది మీరా ? మిమ్ముకలను శాసించునది మంత్రియా ? మంత్రి కనుసన్నల రాజ్యేందిర నర్తించుట కేనా ఆ రత్నమయ సింహాసనమును అధివసించుట !! మంత్రి అడుగు జాడల రాజ్యచక్రమును త్రిప్పుట కేనా మీరీ విజయఖడ్గమును చే ధరించుట !! ఇదేనా మీ సామర్థ్యము? ఇట్టి సార్వభౌమత్వము కన్న సామాన్య ప్రజాజీవితము మేలుకాదా ?

విక్రమ : మేలే! కాదనను. నేను ధరించునది రత్నమయ కిరీటము కాదు; ముళ్ళకిరీటము. ప్రజలను పాలించునది పవిత్ర అహింసా సిద్ధాంతమున కాదు; ప్రజల నెత్తుటి మంటలో పదును పెట్టిన కత్తితో ... ఊర్వశీ ! రాజ్యపాలనకన్న కష్టతర మింకొకటి లేదు.

ఊర్వశి : ఇట్టి కష్టతర కార్యమాచరించు టెందులకు ? కోరి ప్రేమించిన నన్ను విసర్జించు టెందులకు ? ప్రభూ ! ఆశాహస్త్రాల తేలిపోయే స్వతంత్ర జీవితము గడపరాదా ! ఎందుకీ అస్వతంత్ర అసమర్థ తుచ్ఛ బానిస జీవితము?

విక్రమ : ఊర్వశీ ! మనకు అస్వతంత్రము కావచ్చు. ప్రజలకు స్వతం

త్రమే ! ప్రజాసంరక్షణలో రాజుప్రాణములనైననూ విడుచుటకు వెనుదీయరాదు.

ఊర్వశి : ఓహోహో ! ఏమిరాచరికము? ఏమిరాణివాసము? ఇది రాణివాసమా ! వనవాసమా ! (నవ్వి) మనసార, వలపూర, కరువుతీర, నోరార రాణి—రాజుతో మాటాడరాదు. రాజు — రాణితో మేలమాడరాదు. ఇక ఎందులకీ దాంపత్యము ! ఇట్టి అంతఃపురమునకు రాణియగుటకన్న ఏ అ డ వి కో రాణియగుట మేలుకాదా ! ఇటరాణి - అటుఖయిదీకన్న ఎక్కువ ప్రభూ ! రాణికి బంగారుసంకెళ్లు, ఖయిదీకి ఇనుప సంకెళ్లు. భేదము పదార్థమునకాని యధార్థమునకాదు కదా ! ఇంతకూ ఊరపుకొండల నునుపువంటి దీరాణి వాసపువలపు.

విక్రమ : ఊర్వశీ ! ఉద్విగ్నహృదయునివి కాకుము. పరిస్థితులను మనము పాలింపవలయునేకాని పరిస్థితులు మనలను పాలింపరాదు.

ఊర్వశి : అయిన వెళ్ళవలయునా ?

విక్రమ : తిరిగి త్వరలోరానూ ! ఒక్క కనురెప్పపాటులో - ఒక్క క్షణములో (కొంతదూరమేగి తిరిగివచ్చి) ఊర్వశీ ! వెళ్ళునప్పుడు

ఊర్వశి : కనబడతారా !

విక్రమ : తప్పక. (వెడలును)

ఊర్వశి : ఉంటేకదూ !

మాయా : (ప్రవేశించి) ఉండకేంలేతల్లీ ! రా !పూజవేళ అతిక్రమించకుండా రా ! (అని ముందునకువచ్చును)

ఊర్వశి : పూజకోకవేళా?... పూజ! ... ప్రేమపూజారినికి ఈ పూజలెందుకో! ... అఖిలాంతర్యామికి ఒక ఆలయం; ఒకఆరాధన... అర్పించవలసినది ఆత్మ, పళ్ళూ - ఫలహారాలుకావు. భగవానుడే ఒకలంచగొండి అయిన భక్తుల ఆస్తులన్నీ హారతి కర్పూరాలయ్యేవి. ...

(మాయాదేవితో - పూజామందిరం దగ్గరకువెళ్ళి - ఆమెతో కలసి పాటపాడుతూ ఉంటుంది. - అంతలో సూర్యుడు అస్తమిస్తూ

ఉంటాడు. కిటికీసందులనుంచి చూస్తుంది. తాను రాయిఅయిపోతానని తెలిసి వెనుక్కువస్తూఉంటుంది. మాయాదేవి మాత్రం ఆమెను చూడకుండా పాడుకొంటూ ఉంటుంది. ఊర్వశి కొన్ని అడుగులు వెనుకకువేసి భయవిహ్వాలయై ... సంధ్యనుచూస్తూ)

**ఊర్వశి :** అస్తమిస్తున్నాడు సూర్యభగవానుడు. నా ఆనందమూ ఇక అస్తమించును. ఆరిపోవుచున్నది నా నవయౌవన వాసంత లావణ్యం – మారిపోవుచున్నది నా మధుర మనోజ్ఞజీవితం.

అదిగో సంధ్య... మృత్యుసంధ్య... నా ఆశాపుష్పం రేకులు రాలిపోయినా... నా అనురాగపరిమళం మాత్రం నా చుట్టూ తిరుగుతునే ఉంటుంది.

అదిగోసంధ్య... జీవనమరణసంధ్య... నా ప్రాణరూపం మా ప్రణయమూర్తి విక్రమసార్వభౌముడు చూడగలడా? చూడ లేడు... చూడలేడు... వెడలవలయును... తెరమాటుకు వెడల వలయును... ఈ బాధాజీవిత విషాద గాథా మాలిన్యం... అబ్బా! చూడలేడు. మళ్ళీ ఉదయసంధ్య ఎప్పుడో ... ఎప్పుడో ఈ సాయంసంధ్యకు వార్ధక్యం... సంధ్య ... మృత్యుసంధ్య...... దూర్వాసశాపం – (పరుగు పరుగున వెడలును)

(మాయాదేవి పాడుతూ ఉంటుంది.)

**విక్రమ :** ఊర్వశీ! త్వరలో వస్తాను.

(అంటూవస్తాడు. జవాబులేదు. ఊర్వశిలేదు. హృదయము శతధావిభిన్నమై పోవును. ఆతృతతో) అమ్మ... అమ్మా!...

**మాయా :** ఏంనాయనా!

**విక్రమ :** ఊర్వశి ఏది ?

**మాయ :** ఊర్వశా!

**విక్రమ :** ఏదమ్మా ఏది! మన ఊర్వశి ఏది?

**మాయ :** (అటూ ఇటూ చూసి) ఏం నాయనా! ఏం! మన ఊర్వశి ఏదీ!

విక్రమ : ఏదీ ! ఇక్కడే ఉండవలయునే ?
మాయా : అవును. ఇక్కడే ఉండాలి; ఏమైనట్లు ?
విక్రమ : (పక్కకు Side curtain వద్దకు వెళ్ళి - ఎలుగెత్తి-) ఊర్వశీ ! ఊర్వశీ ! (అని కేక వేస్తాడు) (లోపలనుండి)
భటుడు : ఊర్వశి ఇప్పుడే రాజభవనందాటి పరుగుపరుగున...
విక్రమ : వెళ్ళిపోవుచున్న ఊరుకొంటిరా? అందులకేనా మీరున్నది? అంతఃపురమునుండి ఎవరు వెడలినా చూచుచూ ఊరుకొనవలసినదే ? (మరొక ప్రక్కకు వెళ్ళి) ఊర్వశీ ! ఊర్వశీ ! !

(లోపలనుండి)

భటుడు : ఊర్వశి పొలిమేర దాటి వెళ్ళిపోయినది. ఆశ్రమంవైపు పరుగుపరుగునా వెళ్ళిపోయినది.
విక్రమ : (కోపంతో) అంతఃపురమునుండి పారిపోవు ఒక అబలను కూడ ఆపజాలని మీ కాపలా ఎందుకు ? కాల్పనా ?

(బాధతో) అమ్మా ! ఊర్వశిని ఎలా విడిచిపెట్టావ్ !

మాయ : నేను ఊర్వశిని విడిచిపెట్టలేదు నాయనా ! నన్నే ఊర్వశి విడిచిపెట్టి వెళ్ళినది.
విక్రమ : అయ్యో ! ఊర్వశీ !
మంత్రి : (ప్రవేశించి) ప్రభూ !
విక్రమ : (ఆతృతతో) ఎక్కడున్నది ఊర్వశి ?
మంత్రి : నాకు తెలియదు ప్రభూ !
విక్రమ : తెలియదా ? తెలియదా ?
మంత్రి : తెలిసిన తెలుపనా ప్రభూ !
విక్రమ : తెలుపరు. తెలుపరని నాకు తెలియును. అందరూ ఏకమై నా ఊర్వశిని నా నుండి వేరుచేసిరి.
మంత్రి : అదేమి ప్రభూ !
విక్రమ : రాజభవనమునుండి ఊర్వశి పోవుట కనులారగాంచియూ,

ఎట్లూరకొనిరి. భవనసంరక్షకులేమైరి ? నాయకులేమైరి ? నగర రక్షకులేమైరి ? అందరూ కన్నులు మూసికొనిరా ? గొంతులు పోయినవా ? కోటలోనికి వచ్చువారి నీ కోటనుండి పోవువారినే తెలిసికొనను నన్న - ఇక రాజ్యపరిపాలనా విధానమడుగంటినట్లే కదా ?

మంత్రి : ప్రభూ ! మన్నింపుడు. ఆమెజాడలు కనుగొందును.

విక్రమ : కనుగొందురు. ఎప్పుడు ? జీవిత గాథకు చివరి తెరజారి నప్పుడా ? ఒకా నొక కళాజీవి అంతఃపురమునకు రారాదో ! రారాజుతో మాటాడరాదో ! స్వతంత్రమే కోరరాదో ! అమాత్య వర్యా ! నే నెరుగుదును. అంతఃపురమున ప్రతిప్రాణియు ఆమెకు వ్యతిరేకమే. అంతఃపురమేకాదు; రాజ్యమేకాదు; త్రిలోకములూ ఆ ప్రేమమూర్తిని కాలంట రాచ ప్రయత్నించుచున్నవి.

కానిండు ! యావత్ప్రపంచ మామెకు వ్యతిరేకమై తలదాచు కొన తావీయక పోనిండు. నా హృదయ మధ్యముననే ఆమెకు పూలపాన్పు; అశ్రుపానము.

అమ్మా ! లోనికరిగి చూడవమ్మా ! అమాత్యవర్యా ! ఆమెకై వెదకుడు. (తల్లి వెడలును.)

మంత్రి : ప్రయాణమో !

విక్రమ : ఇంకను ప్రణయమా ! సృష్టి తల్లక్రిందులైనను నా ఊర్వశిని నేను తిరిగి బడయనిదే ఏ కార్యమూ చేయను. నిదురపోవను. తుదకు గంగముట్టను. అన్వేషణార్థము సేవకులను పంపుడు.

(మంత్రి వెళ్ళును.)

ఊర్వశీ ! లోకములన్నియు నీపై నడచివెళ్ళుటకు నీవుచేసిన అపరాధమేమి ? ఈ అభాగికి అనురాగ భిక్షనిడుటా ! అయ్యో ! ఊర్వశీ ! ఊర్వశీ !

(ముందునకువచ్చి) ఊర్వశీ ! ఊర్వశీ ! అబ్బా ! ఊర్వశీ ! ఊర్వశీ ! ! అని ఎలుగెత్తిఅరచే నాగొంతు అపశ్రుతిబద్ధము కావలసిన

దేనా ? ప్రేమభిక్షుకై చాచినచేయి చాచినట్లే కృశింపవలయునా? ఊర్వశీ ! ఈ అంధజగత్తులో ఒక అంధుడనై నీ అమరపథమునకు ఎన్నాళ్ళు అన్వేషించెదనో !

చ. ఇకపయి **వెన్నెలల్** పొదల నీయగ పూర్ణిమరాదు; చీకటుల్
వికవిక నవ్వికోఱ పగళులే నిశలైన జగత్ స్మశానమం
దొకడ – అనంతమోహా జగదుత్సవ మూలములైన నీదు పె
ద్దకనులు రెండు చుక్కలయి – దారులు చూపగపోదు ఊర్వశీ.



# ఊర్వశి

## పదకొండవరంగం

FRONT STAGE

పాత్రలు : 1. మంత్రి

2. వెంకన్న

స్థలం : రాజాంతఃపురం ముందు

సమయం : సాయంసమయం

సందర్భం : వెంకన్నతో రాజుగారికి విషమిమ్మని చెప్పుట.

*  *  *

మంత్రి : ఊర్వశి అంతఃపురమునుండి వెడలిపోయెను. కాని మహారాజు మరల ఆమెను అంతఃపురమునకు గైకొని వచ్చెను. ఇక ఆమెను ఆయన విడచునట్లులేదు. ప్రజాసంరక్షణమే రాజకర్తవ్యము. రాజును కర్తవ్య విముఖునిచేసినది ఊర్వశీ ప్రణయోన్మాదమే! రాజు స్మృతి పథమునుండి శాశ్వతముగా ఊర్వశిని వేరు చేసినగాని రాజునకు విశ్రాంతి లేదు.

(అటు నిటు తిరిగి ఆలోచించి)

ఆఁ అవును. వేరుచేయవలెను. ప్రజలకై రాజునుండి ఊర్వశిని వేరుచేయవలెను. దేశమునుండి వెడలగొట్టించుటో! ప్రాణములు తీయించుటో! రెండింటిలోనేదియో యొకటి చేయించవలెను. కాదు.....కాదు.....బ్రతికియున్న ఎప్పటికైనచేటే! చంపించవలెను. రాజద్రోహ నేరము మోపి చంపించవలెను. చంపించి ప్రజలను రక్షింపవలెను.

(అంతలో వణుకుతూ వెంకన్న వస్తాడు)

వెంకన్న : ఏం బాబూ ! పిలిచారంట ?

మంత్రి : వెంకన్నా ! ఒక పని చేయవలెనోయి !

వెంక : చెప్పింది ఏది చెయ్యలేదు బాబూ !

మంత్రి : అవన్నీ ఒకెత్తు; ఇదొక్కటీ ఒకెత్తు.

వెంక : చెప్పండి బాబూ !

మంత్రి : (విషంతో నిండిన సీసాతీసి చూపించి) ఇదిగో! చూచావా ? మహావిషం.

వెంక : (ఉలుక్కుపడి) ఎవరి ప్రాణాలు తీయాలి బాబూ !

మంత్రి : రేపు రాజుగారి దర్బారని తెలుసునుకదూ !

వెంక : తెలుసునండి ?

మంత్రి : మారు మాటాడకుండా రాజుగారికిచ్చే ద్రాక్షరసంలో కలపాలి.

వెంక : అయ్యబాబోయ్ ! రాజహత్యే !

మంత్రి : మాటాడక చెప్పినట్లుచేయి. లేదా – ఇదిగో కరవాలము· నీకుత్తుక ఈ కత్తితో ఇప్పుడే

వెంక : (కోపంతో) ప్రాణాలు తీస్తారా !

మంత్రి : మాట్లాడకు !

వెంక : మహామంత్రీ ! ఈ పాపకార్యం చేయకపోతే, నా ఒక్క ప్రాణమే పోతుంది. నా ప్రాణానికి భయపడి ఈ పాపకార్యం చేసి రాజుగారిని చంపితే రాజ్యమేపోతుంది. రాజుగారి మరణం అంటే ప్రజల మరణమే బాబయ్యా ! నేనా పనిచేయలేను. ఇదిగో తల వంచాను. చంపివేయండి.

మంత్రి : వెంకన్నా !

వెంక : ఇంక వెంకన్నేమిటి ? అయిపోయాడు స్వర్గంలో పాతకాపు. నా రాజుకై ప్రాణాలు బలిచేయడంకంటే నాకు కావలసిన దేముంది బాబూ ! దేశప్రజలను ద్రోహంచేసి దేశద్రోహిని కాలేను. పాడు పదవులకొరకు ప్రాకులాడే పాపినికాలేనుబాబయ్యా!

మంత్రి : (వెంకన్న వీపుతట్టి) శభాష్ వెంకన్నా ! కోటికి నీవంటి భరతవీరు డొకడుచాలు. నేనుమాత్రము రాజద్రోహినై రాజును వధింతునా ? ఈ విషము ఆద్రాక్షరసములో కలుపుము. దానిని త్రాగునది రాజుగారుకాదు.

వెంక : రాజుగారైన?

మంత్రి : వెంటనే పాత్రను లాగివైచి విషము నేను కలిపితినని చెప్పుము. ఇతరులైన మాటాడకుము; నాటకము భగ్నమౌను.

వెంక : అలాగైతే సరే...తమరి ఆజ్ఞ.

మంత్రి : నీకు రాజుగారిచేత మంచి బహుమానమిప్పించెదను లెమ్ము.

వెంక : పాపపు పని చేయకుండా ఏమిచ్చినా సరే !

మంత్రి : పాపపుపని చేయించి నిన్ను పాపకూపమున త్రోయుదునా పిచ్చివాడా! పొమ్ము. జాగ్రతతో విషముకలుపుము. ఆసవాలునకు ఆ పాత్రకు రంగు వేయుము.

వెంక : ప్రభువుల ఆజ్ఞ.

మంత్రి : మంచిది వెళ్ళుము. (వెంకన్న వెడలును.)

ఇక నా పన్నుగడ నెగ్గినట్లే - ప్రజాసంరక్షణకు అడ్డు వచ్చునపుడు ఊర్వశినేకాదు, ఎవ్వరినైననూ మన్నింపను. ఊర్వశీ !

(ఉద్రిక్తుడై వెడలును.)

---

# ఊర్వశి

## పంద్రెండవ రంగం

BACK STAGE

—దర్బారు—

(దర్బారులో అటూ ఇటూ మంత్రి సామంత దండనాయకులు కూర్చుంటారు. విజయనినాదాల అనంతరం విక్రమసార్వభౌముడు ప్రవేశిస్తాడు)

భట్టులు : రాజాధిరాజ రాజ మహారాజ విక్రమ సార్వభౌమునకు జై! శాత్రవ కంఠవిలుంఠన కంఠీరవునకు జై! కవికులా లంకార లలిత కళారాధన తత్పర సౌందర్యోపాసకునకు జై!...

(విక్రముడు ప్రవేశించి సింహాసనారూఢుడగును.)

మంత్రి : మహారాజా వారికి విజయమగు గాక! రాజమాతకు నమస్కృతులు. ఆచార్య, పురోహిత, మంత్రి – సామంత – దండనాయక – సేనాపతీత్యాదులకు నా అభివాదనములు. ప్రజాకోటి నా ఆశీస్సులు.

ప్రజాభీష్టముల నెరవేర్చి – ప్రజాభ్యుదయమే జీవిత పరమావధిగా భావించి, శాంతి, స్వతంత్ర అభ్యుదయములను, ప్రజాకోటికి ప్రసాదించిన రాజాధిరాజ విక్రమ సార్వభౌముల జన్మదినోత్సవ వైభవమునందు పాల్గొను భాగ్యము మనకందరకూ లభించినందులకు, యథార్థముగ ధన్యజీవులమే! (ఒక ప్రక్క అతి ఠీవిగా కూర్చునియున్న ఊర్వశివంక నిశితంగా చూస్తాడు. ఊర్వశి నిర్లక్ష్యంగా తలఊపి నవ్వుతూ విక్రమునివంక చూచింది. మంత్రి ఉగ్రుడై పోయాడు. ప్రజలవైపు చూచి)

నేటి కార్యక్రమము విక్రమ సార్వభౌముల ఆదరము నందిన "దేవదాసి" యగు ఊర్వశీ నృత్యముతో ప్రారంభింపవలయునని ప్రభునాజ్ఞ.

విక్రమ : (కోపమున) అమాత్యశేఖరా !
అనురాగ నిధానమగు ఊర్వశిని అర్థించినది నృత్యమైననూ మీ మాటలు తాండవము చేయుచున్నవి. ఆమె నానుండి పొందినది ఆదరముకాదు – అను రాగము; అచంచల విశ్వాసము; అసమాన అనురక్తి; అసదృశప్రేమ.

మంత్రి : చిత్తము.

విక్రమ : ఊర్వశి దేవదాసి కాదు; ప్రేమదాసి. ఆమె ఆరాధించునది విగ్రహములను కాదు; ప్రేమమూర్తులను. ఆమె అర్థించునది పదవులు కాదు; పవిత్రప్రణయము. ఊర్వశీ నృత్యము ఆజ్ఞాపించునది కాదు; అర్థించునది.

మంత్రి : మీ భావవైరుధ్యపద ప్రయోగములకు మన్నింపుడు.

విక్రమ : మన్నించుటకు ప్రజలున్నారు.

మంత్రి : ప్రజలు తమ పాలితులు.

విక్రమ : కాదు; నా పాలకులే ప్రజలు.

మంత్రి : మహారాజా !

విక్రమ : (నిర్లక్ష్యముగా కూర్చొనమని చేయినూపును. మంత్రి మారాడక కూర్చుండును. ఊర్వశివంక నవ్వుతూ చూచి) ప్రేయసీ ! – (సభాసదులంతా "ప్రేయసీ !" అని ఆశ్చర్యభయానకములతో తమలోతాము ప్రశ్నించుకొందురు. వారిని రాజు చూడడు. ఊర్వశి చూస్తుంది. గ్రహిస్తుంది వారి నిగూఢభావం.) ప్రేయసీ ! దివ్యనృత్యం ప్రారంభింపవా ?

ఊర్వశి : ప్రభునాజ్ఞ.

విక్రమ : సంతోషము ఏదీ సుదివ్యనృత్యమునకు పూర్వము ఆసవ రసపాత్ర.

ఊర్వశి : ఇదిగో – (ఆమెపాత్రగైకొని ఈయబోవును)

మంత్రి : వలదు. మహారాజా ! వలదు. త్రాగవలదు. మహాభయం కరము.

విక్రమ : మహామంత్రీ ! ఏల వారించుచుండిరి?

మంత్రి : ఆ పాత్రలో ఉన్నది మధువుకాదు.

విక్రమ : (సింహాసనమునుండి) మధువుకాక !

మంత్రి : మహావిషము.

(అందరు "విషమా ! విషమా" ! అని నివ్వెరపోదురు)

విక్రమ : విషమా !

మంత్రి : అవును ప్రభూ !

విక్రమ : నా ఊర్వశి నాకు విషమిచ్చునా ? కల్ల, ముమ్మాటికినీ కల్ల – నమ్మజాల !

మంత్రి : అసత్యముకాదు ప్రభూ ! పరిశీలింపుడు. అది మహావిషము కాక మధువేఅయిన నా శిరసును ఛేదించి తమకోట గుమ్మమున బంధింపుడు.

విక్రమ : మధువైన శిరచ్ఛేదనమా ?

మంత్రి : మారుమాటాడక. అసత్యమునకు తగిన శిక్ష అనుభవించెదను (విక్రముడు సింహాసనమునుండి ఒకమెట్టు క్రిందకుదిగి సభాసదుల నందరినీ తీక్షణముగా పరిశీలించి)

విక్రమ : ఇది విషమా ! విషము వేయసి ప్రియునికిచ్చునా ? (ఆలోజించి – మంత్రివంకచూచి కోపాగ్నులుకురిపించుచు) మహామంత్రీ ! ఇందు విషమెట్లువచ్చినది?

మంత్రి : కలిపిన.

విక్రమ : ఎవ్వారు కలిపిరి ?

మంత్రి : ఊర్వశి.

విక్రమ : మీకెట్లు తెలిసినది?

మంత్రి : గూఢచారులవలన.

విక్రమ : అనృతములాడని గూఢచారులేనా ?

మంత్రి : అవశ్యము.

(విక్రముడు మరొక మెట్టుదిగి, అందరినీ కలియజూచి తలవంచుకొన్న ఊర్వశినిజూచి —)

విక్రమ : ఇది విషమేకానిండు; అమృతమేకానిండు; నాప్రియురాలిచ్చినది. అంతియేచాలు; త్రాగివైచెదను.

(అందరూ ఒక్కుమ్మడిని - "వలదు... వలదు... త్రాగ వలదు" అని వారిస్తారు విక్రముడు బాధతో) మీరందరూ దీనిని నమ్ముచున్నారా ?

ప్రజలు : పూర్తిగా, అదివిషమే. త్రాగవలదు. త్రాగవలదు.

విక్రమ : లక్షమంది ఏకైక కంఠముతో "ఇదివిషము. విషము త్రాగ వలదు"అనివారింపుడు. నేనువినను. ఇదివిషమని నేనునమ్మను. ఇది విషమే అయిన... నా ఊర్వశినాకు విషముపెట్టిన అమృతముగా స్వీకరించెదను. ఏ పరమ ప్రయోజనమర్థించి విషము కలిపినదో ఆ ప్రయోజనము నెరవేరుగాక ! —

నా హృదయ సింహాసనమును పాలించు నా ఊర్వశికి ఆనందము కలుగునేని, ఏపనిఅయిననూ చేయుటకు నేను సంసిద్ధుడనే.

(త్రావబోవును)

ప్రజలు, మంత్రి : ప్రభూ ! ఆగుడాగుడు. మీ ప్రేమకొఱకు మీరు మరణించిన ప్రజలను చంపినట్లే - ఈ వ్యధ మీకుకాదు; మాకు. మీరువిధించుకొనుశిక్ష మీకుకాదు; మాకు ప్రభూ ! నేటివరకు ప్రజలను కన్నబిడ్డలవలె పాలించుచున్నారు. ఇప్పుడు మీ ఊర్వశికై మమ్ముత్యజించి నాశనముచేయుదురా ?

(ఒక్కొక్కరు అందురు.)

మంత్రి : మహారాజా ! అటుప్రేమ - ఇటుప్రజలు - ప్రేమ సంస్థాప

నార్థము మీరు ఊర్వశీ వ్యామోహమునకు బలిఅయి ప్రజలను బలిసేతురా ? ప్రజాసంరక్షణార్థము ఊర్వశిని త్యజింతురా ? ఆలోచించుకొనుడు. ఒక్కరికొరకు కోటానుకోట్ల ప్రజలను త్యజింతురో ! కోటాను కోట్ల ప్రజలకొరకు ఒక్కరిని త్యజింతురో! యోజించుకొనుడు.

విక్రమ : మహామంత్రీ ! – ప్రేమ జగదభిదేవత, ప్రేమ భగవత్స్వరూపిణి ! ప్రేమకొరకు ఒక్క రారాజేకాదు; సృష్టే బలికావలెను. రాజులు వచ్చెదరు; పోయెదరు. రాజ్యముల నిర్మింతురు; నిర్మూలించెదరు. సృష్టి కెన్నియోమార్పులు కానీ ప్రేమమారదు. అది యుగ యుగాంతములవరకూ ధృవతారవలె వెలుగును.

మంత్రి : అందున ప్రజలనే త్యజించెదరా ?

ఊర్వశి : త్యజించరు. ఒకానొకస్త్రీ, సామాన్యస్త్రీకై, అందునూ సంఘపరిత్యక్త – దూషిత – వంచిత – అయిన "దేవదాసి"కై మహారాజులు ప్రజలను త్యజించరు. (రాజువైపు చూచి) మహారాజా !

విక్రమ : ఊర్వశీ !

ఊర్వశి : ఏదీ ! ఆ అమృతపాత్ర.

విక్రమ : అమృతపాత్రా ! విషపాత్ర కాదూ !

ఊర్వశి : నా ప్రభువునకే విషమిచ్చెదనా ? నా హృదయమునే నేను ముక్కలు చేసుకొందునా ? ప్రభూ ! అది విషమైన ఇటు తెండు.

విక్రమ : నీవు విషమిచ్చిననూ త్రాగగలను. కానీ నీ మృతిని మాత్రము నేను చూడలేను.

ఊర్వశి : రాజా ! నాకు మృతా! రాదు. ప్రేమమూర్తికి జరామరణములు లేవు. అనురాగ మూర్తికి హాలాహల మైనను అమృతము కాగలదు. ఏదీ దయతో – ప్రేమతో –

విక్రమ : నేను పెంచిన ప్రేమవల్లరిని నేనే త్రుంచుకొనవలెనా !

ఊర్వశి : భయపడకండి! భగవానున్నాడు. దుష్టులకు శిక్ష, శిష్టులకు రక్ష... తప్పదు.

మంత్రి : అవును. తప్పదు. అందుననే మహారాజా! ఆమెకా పాత్ర నింపు. సత్యాసత్యము లొక్క క్షణములో తేలగలవు.

ఊర్వశి : తప్పక తేలగలవు; నాముద్దు చెల్లించి నన్నా పాత్రతో అనుగ్రహింపుడు.

విక్రమ : ప్రణయజీవులకు పరీక్ష.

ఊర్వశి : ....... ఆశీర్వదించి అందీయుడు.

విక్రమ : ప్రేమ జయించునుగాక !

(పాత్ర చేతి కందిచ్చును. ఆమె పాత్ర ధరించి నలుగురినీ కలియచూచి)

ఉ. ఆశ నిరాశ యాయెె; మధురాసవమందు విషమ్ము నిండె నా
కోసమె వేచి యుండె; నయికొమ్మని మృత్యువు పిల్చుచుండె; ని
ర్దోషిని, లేత కోరికలతో కృసియించెడు మంద భాగ్య నో
యీసఖ! ప్రేమ పాత్ర ధరియించితి; భిక్ష మనుగ్రహింపరావో! 

(పద్యం చదివి విమంత్రాగి తాండవం చేస్తూఉంటుంది. అందరూ ఆశ్చర్యంతో చూస్తూఉంటారు. విక్రముడామె చావక పోవుట చూచి క్రిందకు దిగివచ్చి – ఆ సభలో దగ్గర జేర్చి – మంత్రి వంక కోపంగా చూచి)

విక్రమ : అమాత్యశేఖరా! ఇప్పుడేమందురు ?

మంత్రి : శిరచ్ఛేదన చేయమందును.

విక్రమ : శిరచ్ఛేదనమా ?

ఊర్వశి : వలదు. వలదు. ఆయన శిరచ్ఛేదనమైన ప్రజా శిరచ్ఛేదనమే. ఆయన లేకున్న రాజ్యమే లేదు... సత్యమూర్తి!... ప్రేమదాత!... ఈ రాజ్య భారమునంతయూ, ఆయన మూపుననే మోయనిండు.

మంత్రి : క్షమార్హుడను కాను. క్షమాభిక్షనర్థించుట లేదు. శిక్షింపుడు. శిరచ్ఛేదనము చేయుడు.

విక్రమ : మహామంత్రీ! ప్రేమమూర్తిని శంకించువారికి తగిన శిక్ష ఈ సృష్టిలో లేదు. శిరచ్ఛేదన మాత్రమున ఆపాపము శమింపదు.

మంత్రి : అవునవును

విక్రమ : (ఊర్వశిని చూచి) ఊర్వశీ! ప్రేమ కీనాడే అమృతము పోసితివి. ఇక ప్రేమమూర్తికి జరామరణములు లేవు. ఇట్టి నిన్ను పరిణయమాడి నా జన్మ సార్థకము చేసికొందును.

మంత్రి : పరిణయమా! ప్రభూ! ఒక దేవదాసిని మహారాజు పరిణయమాడుటా?

విక్రమ : వీలు లేదా?

మంత్రి : లేదు.

ప్రజలు : వీలు లేదు. వీలు లేదు. రాజుగారు దేవదాసిని వివాహమాడుటకు వీలు లేదు.

విక్రమ : ఎందుచేత?

మంత్రి : ఆమె దేవదాసి గనుక.

విక్రమ : దేవదాసికి వివాహార్హత లేదా?

మంత్రి : లేదని శాస్త్రములు ఘోషించుచున్నవి.

విక్రమ : శాస్త్రములు మానవ నిర్మితములు. ప్రేమరాజ్యమున సర్వజ్ఞునినుండి సామాన్యుని వరకూ అందరూ ఒకటే.

మంత్రి : అది ప్రేమ తత్త్వమైనకావచ్చును. రాజ్యాంగ విధానము మాత్రము కాదు. మా ప్రభ్వీణి ఒక మహదైశ్వర్య రాజకుటుంబమునకు సంబంధింపవలెనే కాని – నీచకుల సంజాత యైన రాజ్యార్హత లేదు. ఊర్వశి...

విక్రమ : చాలు మీ శాస్త్రోద్ఘాటన.

గీ. జాతికులమత భేదాల నీతికలదె ?
మనుజులను వేరుచేసెడి మతములేల ?
అఖిలవ్యాపి భగవాను నాలయంబు;
"వారు - వీర" ను భేద మావంత లేదు.

మంత్రి : మహారాజా ! ఆర్యధర్మము లతిక్రమింపరాదు.

విక్రమ : నా అంతరంగిక విషయములలో మీరు కలుగజేసుకొనుట అసమంజసము; అక్రమము. నాస్వేచ్ఛను అరికట్టి - నాప్రేమ జీవనమున విషబీజములు మీరు నాటయత్నింపరాదు. నాధర్మము మిమ్ములను పాలించుటే-కాదనను; కాని నా ఆత్మీయప్రబోధము లకు మాత్రము నేను విరుద్ధముగా సంచరింపలేను. ధర్మము కాలానుసరణము. ఆత్మకాదు. నిర్మలప్రేమ కాదు...... మీ రేమన్ననూ ప్రేమమూర్తియగు ఊర్వశినే వివాహము చేసి కొనియే తీరెదను.

ప్రజలు : వీలులేదు ... వీలులేదు.

మంత్రి : ప్రజలను గౌరవించతలచిన వివాహము చేసుకొనరాదు.

విక్రమ : (ప్రజలనుచూస్తూ) అమాత్యశేఖరా! ప్రజలారా !! మానవ హృదయ మతినిగూఢము; భావగర్భితము; స్వేచ్ఛాజనితము. దానిస్వతంత్రేచ్ఛ నెవరూ అరికట్టరాదు; అరికట్టలేరు. ఊర్వశీ వివాహమే మీ కయిష్టమైన ... మంచిది ... మీ ఇష్టము వచ్చిన రాజునెన్నుకొని పాలించుకొనుడు.

క్షుద్రభోగములకు - తుచ్ఛయశమునకు - ప్రజామన్ననలకు చేయిచాచి - నిష్కళంక, నిర్మల, నిర్వ్యామోహా, నిశ్చల, ప్రేమను వీడలేను.

అశాశ్వితమైన రాజ్యమునకు రాజునై యుండుటకన్న, శాశ్వత ప్రేమరాజ్యమున సభ్యుడనగుటమేలు ఇదిగో మీ రత్నమయ

కిరీటము. ఇదిగో శత్రువిరాదళితరాజఖడ్గము. గ్రహింపుడు. మీరే ఈ రాజ్యమును పాలించుకొనుడు.

ప్రజలు : వలదు - వలదు - మీరే పాలింపవలయును.

విక్రమ : ఊర్వశిని

ప్రజలు : విడువవలెను

విక్రమ : అది అసంభవము. రెండుకత్తులొక ఒరలోనుండ జాలవు... రా... ఊర్వశీ ! రా !

మాయా : నాయనా ! నామాటేమిచెప్పెదవు ?

విక్రమ : నాతో నీవునూ రావమ్మా

మాయా : మంచిది. పోనీ వారుచెప్పినట్లు...

విక్రమ : వీలులేదమ్మా ! - రా... ఊర్వశీ

(ఊర్వశి - విక్రమ - మాయాదేవి - వెడలుదురు)



# ఊ ర్వ శి

## ప ద మూ డ వ ర ం గ ం

FRONT STAGE

(ఊర్వశి వెడలుచుండ మంత్రి ప్రవేశించి)

మంత్రి : ఊర్వశీ! ఊర్వశీ!

ఊర్వశి : (వచ్చి) ఎందుల కింకనూ మీరు ఆనందముగ లేదా?

మంత్రి : ఊర్వశీ! నీవు సార్వభౌముని యథార్థముగ ప్రేమించితివి గదా!

ఊర్వశి : ఆఁ! యథార్థముగ ప్రేమించు టేమి? ఆయన కొరకై నా సర్వస్వమునూ ధారపోసెదను ... నా హృదయమున కంటె మిన్నగా...

మంత్రి : ప్రేమించుచుంటివా?

ఊర్వశి : అంతేకాదు. నా ఆత్మకంటె ఎక్కువగా ప్రేమించు చున్నాను.

మంత్రి : వారికొరకు ఏమిచేయమన్న అదిచేయుదువా?

ఊర్వశి : తప్పక...ప్రాణమిమ్మన్న ఆనందముగ ఇచ్చెదను.

మంత్రి : ఊర్వశీ! నీ కొరకై ఆయన పిచ్చివాడైపోయెను. రాజ్యమును సహితము విడిచిపెట్టెను. ప్రజలందరూ కన్నీరు మున్నీరుగా ఎట్లు విలపించుచుండిరో చూచితివా?

ఊర్వశి : అవును వారిస్థితి – తలచుకొన్న నా హృదయము ద్రవించి పోవుచున్నది.

మంత్రి : నీవీరాజ్యమున ప్రవేశించకముందు రాజుగారెంత శాంతి ప్రదముగ జీవితమనుభవించిరో ఊహింపగలవా ?

ఊర్వశి : ఊహింపకేమి?... ఊహింపగలను. ఆయన శాంతిని కూకటి వేళ్లతో పెగిలించి నాశనమొనర్చినది నేనే-నేనేవారిని రాజ్యచ్యుతిని చేసినది. వారిని వారి ప్రజలనుండి వేరుచేసినదీ నేనే - నా స్వార్థపరత్వమే-

మంత్రి : విచారింపకు ఊర్వశీ ! - ఇప్పటికైన మించినది లేదు. నీవు నేనుచెప్పినట్లు చేయుదువా ?

ఊర్వశి : మా విక్రమునిక్షేమము కొరకై ఏమైన చేయుదును.

మంత్రి : అయినచో ఈ క్షణముననే, నీవీ రాజ్యమును వీడి-ఎటకో-విక్రముని దృష్టి కందనిచోటునకు వెడలిపోవలెను.

ఊర్వశి : విరహవేదనచే ఆయన హృదయమే శిథిలమగునేమో !

మంత్రి : ఎన్నటికీకాదు. చనిపోయినవారితో చనిపోవుచున్నామా ? ప్రకృతే మనలో ఆ మార్పుతీసుకొని రాగలదు.

ఊర్వశి : మంచిది. చనిపోయినవారివలెనే నేనూ తరలిపోయెదను. ఎటులో - ఎటకో - ఏదిశాంచములకో - ఏశమోగర్భాంతికము నకో-ఏ మృత్యుగహ్వరమునకో - వెడలిపోయెదను.

మంత్రి : విక్రమ సార్వభౌముసేకాదు. కోటాను కోట్ల ప్రజలను రక్షించిన పుణ్యము కట్టుకొందువు.

ఊర్వశి : పుణ్యమా !... అహ్హహ్హా... పుణ్యమా ! మీరు వెడలుడు. నేనే పోయెదను.

మంత్రి : ప్రజా హింసకంటె - ప్రణయమూర్తులను వేరొనరించిన మహాపాపమునైన అనుభవించెదను.

(వెడలును)

— విషాదగీతం —

ఊర్వశి : లోకమా !
ఓ
లోకమా !
నా
లోపమేమే ?
లోకమా !

మావి చివురులు మెసవు కోకిల
మధుర గీతల మేలు కొనుచు,
సాటి వారల తోటి పాడగ,
ఏటికే నాగొంతు నులిమెదు ? ॥లోకమా॥

ప్రేమకొరకై చేయిచాచిన,
చేదువిషమును చిలుకరించెదు;
ప్రేమపూజకు పూలుకోయగ
కోడిత్రాచై కాటువైచెదు –; ॥లోకమా॥

హృదయవీణియ మీటరాదో ?
మధురగీతము పాడరాదో ?
కలువరింతల, వలపుకలసి,
కంటికొనలో ప్రాణమునిలచె – ॥లోకమా॥

లోకమా నా లోపమేమే
లోకమా !

* * *

* * *

—

# ఊర్వశి

## పదునాల్గవ రంగం



## BACK STAGE

(గీతానందుని ఆశ్రమము. గీతానందుడు పాడుకుంటూ ఉంటాడు. అంతలో ఊర్వశి ప్రవేశిస్తుంది)

ఊర్వశి : (ప్రవేశించి) గీతానందస్వామీ! ప్రేమించుట దోషమా? ప్రేమకు స్థానము లేదా? సృష్టి అంతయూ అంధకారమై నాయెద నడచి పోవుచున్నదే – నేను చేసిన అపరాధమేమి? ప్రేమించుట అపరాధమా!

గీతా : కాదు. ప్రేమ దైవితము. ప్రేమించుట కెల్లరకూ అర్హతకలదు.

విక్రమ : (పరుగు పరుగున వచ్చి) మహర్షీ! ప్రేమించుట దోషమా? ప్రేమకీ విశ్వ విశ్వంభరాతలమున స్థానమే లేదా? ప్రేమ మూర్తులకు నిలువ నీడయే లేదా? ప్రేమికులు నాశనము కావలయునా?

దూర్వాస : (ప్రవేశించి) అవసరము లేదు.

నారద : (ప్రవేశించి) ఎన్నటికీ అవసరము లేదు.

ఇంద్ర : (ప్రవేశించి) ముమ్మాటికీ అవసరము లేదు.

గీతా : అసలీసృష్టినిపాలించి, లాలించి, పెంచి, పోషించునది ప్రేమయే! ప్రేమమూర్తులకు జగములే వినతులొసగును.

నారద : ఏమందువు దూర్వాస మహర్షీ!

దూర్వాస : నాగర్వము సర్వమూ ఖర్వమైన దందును. ఊర్వశీ శాపవిమోచనము – స్వర్గపురి ప్రయాణము నేడే.

ఇంద్ర : నేడే – ఊర్వశి లేనిచో వసంతోత్సవమే లేదు. ఊర్వశి లేకున్న స్వర్గమే నరకము. కాన ఊర్వశీ ! మాతప్పులు మన్నించి స్వర్గమునకు ప్రయాణము కావలయును.

ఊర్వశి : మహేంద్రా ! ఆపదలచే పదును వారిన హృదయము పరమార్థ మెరుగగలదు ఆశ్రయమిచ్చిన వృక్షమును వీడిన లత నేలపాలగును. నేనిక స్వర్గమునకు రాజాలను. ...

విక్రమ : స్వర్గమా ! ... స్వామీ ! ఈమె స్వర్గనివాసినియా ?

గీతా : అవును ... శాపవశమున భూలోకమున ...

ఊర్వశి : వసించుట శాపవశమున కాదు. పూర్వజన్మ పుణ్యవశమున – స్వర్గముకన్న భూలోకమే ప్రేమమయము.

స్వర్గమున మహేంద్రు నంతటివారు మమ్ము తమస్వార్థమునకై బలిచేసిరి.

ఇటనాకై తన సర్వస్వమునూ త్యజించిన ప్రేమమూర్తి విక్రమ సార్వభౌముని త్యాగము, ప్రేమ ఎన్నిజన్మలకు మహేంద్రునకు రాగలవు ?

ఇంద్ర : అందుచే ?

ఊర్వశి : స్వర్గమునకు రాజాలను. భూలోకమే స్వర్లోకము కన్న ప్రేమపూరితము.

ఇంద్ర : మీరిరువురూ రండు.

విక్రమ : ప్రజలను వీడి నేను రాలేను.

ఇంద్ర : విక్రమ సార్వభౌమా ! నీ నిర్మల ప్రేమతత్త్వమునకు మెచ్చితిని. మీరిరువురు ప్రేమీ ప్రేమకులై రాజ్యమును పాలించెదరుగాక ! ... ప్రజల మన స్తత్త్వములు మారినవి లెండు.

—♦ (మంత్రి - ప్రజలు) ♦—

సార్వభౌమా ! మీరు లేని రాజ్యము మాకు అరణ్యము. మీ రేచ్చటున్న అందరమునూ అచ్చటే ఉండెదము.

ఇంద్ర : అయిన అదే రాజ్యము.

దూర్వాస : కాదు. అదే ప్రేమరాజ్యము; ప్రజారాజ్యము. ఊర్వశీ ! నిన్ను శాపవిముక్తను చేసితిని.

ఊర్వశి : ధన్యురాలను.

గీతా : ఊర్వశీ! ఇదిగో! సుమమాల నీప్రియునిగళమున ... విక్రమా!- నీకిదిగో !-

ఇరువురి కిచటే మహాత్ముల ముందు వివాహము చేయుదము గాక !

(ఇద్దరూ దండలు వేసికొంటురు. అందరు మంత్రాలు చదువుతారు.)

దుర్వాస :

ప్రోడుమ్రైనను చిగురించి మొగ్గతొడుగు
ఒక్క అహింసావ్రతుని ప్రేమ !
పాషాణిఅయిన ద్రవించి, కరంగిపోదె ఒక్క
ప్రేమ వ్రతునిగాంచి.

మ ం గ ళ ం.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

# నా కృతజ్ఞత.



"నాటక వ్యాఖ్యాతలగు నటీనటులకు, విమర్శకులకు, నాటక మాడించుటలో ధన మన తనవుల నాశ్రై వెచ్చించిన మిత్రులు శ్రీ ఘంటయ్య, జగన్నాధరావుగార్లకు, నాటకము ప్రచురించుటలో నానా కష్టములకు లోనైన మా నాన్నగారికి, నాటకమును సకాలములో అచ్చువేసిన శ్రీ పాండురంగ ప్రెస్ వారికి నా నమస్సులు. మరువరానివి వారి మేలు ... ఊర్వశీ నాటకము గురించి ద్వితీయ ముద్రణలో వ్రాసుకొందును.

నమస్తే

ఏలూరు, 9—1—1948.

మీ
జంపనే.



Printed by Sree Panduranga Press, Ellore
For Jampana Book Depot. Q. H. No. W. G 7. 6 Jan. 1947/700